# SESHENDRA JAALAM

# శేషేంద్ర జాలం

*A Critical Analysis of*
Seshendra's Poetry

ఆవంత్స సోమసుందర్
A. SOMASUNDER

కళాకేళి ప్రచురణ
A KALAKELI PUBLICATION,
Pithapuram, East Godavari Dt., (A.P.) 533 450.

First Edition 1976

1000 Copies



**Availalbe At:-**

1. Andhra Pradesh Book Distributors
   3237, Rashtrapati Road, Secunderadad.

2. C.L S. Book Shop
   Nampalli Station Road, Hyderabad

3 Kalakeli
   Pithapuram, East Godavari (Dt )

వెల రు. **2-00**

Printed at :-

**DAKSHIN BHARAT PRESS**

**Khairatabad, Hyderabad-500004.**

# విషయక్రమం

## అంకితం :

ప్రణయమూ కవితాప్రణవమూ
అర్ధనారీశ్వరంగా పెనగిన
వాగర్ధ విభూతులు

—సోమసుందర్
ఏప్రిల్ '75

# ఈ గ్రంథాన్ని మీ ముందుంచుతూ...

రెండు మాటలు చెప్పాలని ఉంది. ఆధునిక ఆంధ్రసాహిత్యంలో కవితా శాఖ అపారాకాశావకాశాలనన్వేషిస్తూ పురోగమిస్తోంది. గొప్పదీపస్తంభాలున్నపుడే చిక్కని క్రీనీడలుకూడా ఉండటం సహజం. నేటి ఆధునిక కవితాచైతన్యంలో కవిత్వమూ అకవిత్వమూ కలనేతగా కలసి కవితోపాసకుని మనసును కంగాళీ పెడుతున్నాయి. దీనికి ప్రధానకారణం ఆధునిక సాహిత్యంలో సర్వప్రక్రియలూ పెంపొందినంత స్థాయిలో ఉత్తమ విమర్శ పెంపొందలేదు. ముఖ్యంగా విమర్శ పేరుతో మన విశ్వవిద్యాలయాధికారుల మన్ననలతో పెంపొందిన సాహితీ సర్వస్వమంతా కేటలాగుల స్థాయికి దిగజారుతున్నదే తప్ప ఉత్తమ కవితావగాహనకు దిక్సూచిగా అమరగలిగే సవ్యాఖ్యా సద్విమర్శ అనడానికి అర్హం కావడంలేదు. ప్రతివాడూ కవిత్వ స్వరూపాన్ని ఆరాధించడానికే, తద్వారా కీర్తి సోపానాల కెగబ్రాకడానికే అంగలారుస్తాడుకాని, ఉత్తమకవిత గురించిన తన కలవియైన అవగాహనలో తన దర్శనము వ్యక్తంచేసేవాడు కాడు. ఈలోపాన్ని భర్తీచేయవలసిన అవసరం అందరూ, అంటే త్రికశుద్ధిగల సాహితీ పిపాసువులందరూ చాలాకాలంగా గుర్తిస్తూనే ఉన్నారు. కానీ పూనుకునేవాడే కనిపించడం లేదు, ఉత్తమ

విమర్శకుడు కావడానికి ఉత్తమ కవితా హృదయమున్నప్పుడే సాధ్యంకానీ సైద్ధాంతిక పాషండత్వంతో తీర్పరులుకావడంవల్ల సత్ఫలితం లభించదు. ఈమేరకు ఆధునిక కవితను ఆరాధించే వారి అవగాహనా పరిధులను విస్తృత పరచడానికి నేను నా శాయ శక్తులా కృషిసల్పడం గురించి నాపాఠకులకు విన్నవించుకో నవసరం లేదు. 1966 జులైలో స్వర్గస్థుడైన బాలగంగాధరతిలక్ కవితా సమాలోచనను రాసి విశాలాంధ్రలో ధారావాహికంగా ప్రచురించడం గురించిగాని విపరీత ఋతుపవనాల బారి పడి తన తెరచాప చిరుగులుపడుతున్న స్వర్గీయ కవి నారాయణబాబు రుధిరజ్యోతి కవితలగురించి సమగ్రవ్యాస సంచయం రచించి అనేక పత్రికలలో ప్రచురించడం గురించిగాని నేను మళ్లీ యిక్కడ చెప్పుకోవలసిన పనిలేదు. శ్లాఘ్యమానమైన ఉత్తమ కవితను పరిచయం చేయడానికీ అకవిత్వ దుర్వాయువులను అరి కట్టడానికీ గత దశాబ్దికాలంగా నేనుచేస్తున్న కృషిగురించికూడా వేరుగా చెప్పాల్సిన పనిలేదు.

ఇక వర్తమాన ఉద్గీథగా వెలువడుతున్న శేషేంద్రకవితా జాలంలోగల సూక్ష్మాతిసూక్ష్మ రహస్యాల గురించి ఈ గ్రంథంలో వివరించడానికీ సోదరకవితోపాసకులకీ, రసజ్ఞకవితా రాధకులకూ నిర్దిష్ట మార్గదర్శనం చేయడానికి ప్రయత్నించాను నా ప్రయత్నాన్ని అనసూయాత్ములైన సహృదయులు ఆమో దిస్తారని విశ్వసిస్తూ సెలవుతీసుకుంటాను.

భవదీయ<br>సోమసుందర్

# ఇరవయ్యొకటో శతాబ్దపు

# కవితా అధిష్ఠానంగా

# అమరిన

# శేషేంద్ర కవితా జాలం

మొదటి ప్రకరణము :

# ఈ శతాబ్ది సాహితీ చరిత్రలో శేషేంద్ర కవిత

పంధొమ్మిదో శతాబ్దపు చివరి పాదం వరకూ తెలుగు కవులు ప్రయుక్తం చేసిన పదజాలం- 900 ఏండ్లుగా మన కావ్యాలలో స్థిరపడి ఉన్నదే. వాడగా వాడగా నలిగి కగ్గి, నిస్తేజమైన ఈ పదజాలం - మనోలోకాన్ని ప్రజ్వలితం చేయజాలక పోయింది. 'మొద్దుబారిన పద్మముఖులూ, చీపిరి కళ్ళ చంద్రవదనలూ మరుగుజ్జులైన మదేభ కుంభస్తనలూ మన సాహిత్యం నిండా క్రిక్కిరిసి పోయారు. చదువరి మనస్సుకు కొత్త వెలుగు రేకులద్ద లేకపోయారు. నిలవబారిన కవిసమయాలూ, అవసరమున్నా లేకున్నా నిర్జీవ విశ్వాసంగా రూపొందిన సంప్రదాయాలూ, అనవసరపు అష్టాదశ వర్ణనలూ మన కవిత్వానికి బలాన్ని గాక వాపును చేకూర్చాయి.

ఈ విధంగా ఆ పదసముచ్చయం యావత్తూ, గతించి పోయిన కాలానికీ, లోకానికీ, చెందినదై ఆనాటి మేధావులలో విముఖతను కలిగించింది. సంప్రదాయ అంధానుకరణంగా గాక 'జంబూ ద్వీపే' 'భరతవర్షే' మాత్రమే విపులాచ పృథ్వీ అను

వ్యక్తీకరణ విధానాన్నో-సృష్టించాననుకోవడం ఆటవిక దశకు తిరిగి వెళ్ళిపో చూడడమే తప్ప అన్యంకాదు.

ఏ పద్ధతికి చెందిన కవిత్వమైనా కవులలో మూడు రకాల వాళ్ళుంటారు. అందులో మొదటి రకం కవులు ప్రయోగ శీలురు. కవితా స్వభావాన్నీ స్వరూపాన్నీ అపూర్వంగా ఎన్నిక చేసుకుంటారు. వినూత్న అభివ్యక్తి పరికరాలనూ, సంవిధా నాన్నీ తమకు తాముగా సృష్టించుకుంటారు.

రెండో రకం కవులు సంవిధానాన్ని తమ పుట్టుకకు ముందే సంసిద్ధమయిన దాన్ని స్వీకరిస్తారు. అయినా ఇతి వృత్తాన్నీ రీతిని, అభివ్యక్తినీ సంపూర్ణంగా నూత్నత్వంతో భాసించేటట్లు జాగ్రత్త వహిస్తారు.

మూడోరకం కవులు ఇతివృత్తాలలో గాని, సంవిధా నాదులలో గాని తమంత తాముగా ప్రయోగశాలనుంచి వెదికి తెచ్చుకునే కష్టానికి గురికారు. తమ పూర్వులు ఎన్నోసార్లు స్వీకరించిన ఇతివృత్తాన్నే, తమ పూర్వులు ప్రయోగించిన సంవిధానంలోనే టన్నులకొద్దీ కవితల్లుకుంటూ పోతారు.

ఈ మూడోరకం వారిలో చాలా అరుదుగా మాత్రమే పూర్వ సంవిధానంలోనైనా, అభివ్యక్తిలోనైనా అభివృద్ధి ప్రదర్శించగలిగే శక్తిమంతులుంటారు.

తన కాలం వరకూ ఉన్నదాన్ని పూర్తిగా ఆకళించుకొని తన కాలం నాటికి లేనిదాన్ని సృజించి అభివృద్ధి చేయడమే-

ఏ పదమైనా అతిగా వాడడంవల్ల మొనలు అరిగిన వజ్రంలా ప్రకాశించడం మానేస్తుంది. కాలక్రమేణా మొద్దుబారి కాంతి విహీనమవుతుంది ప్రాజ్ఞుడైన ఒక కవి తన కవితాభివ్యక్తికి అనుకూల వాహకమైన భాషను తానుగా ప్రజల భాషా భాండారం నుంచి ఎన్నుకుంటాడు. తన కవితా ప్రాస్వలిపిని తానుగా రూపొందించుకుంటాడు. ముఖ్యంగా ఆధునిక యుగంలో ఈ పునస్సృష్టి అనవరతం ప్రతిభావంతులైన కవులు నిరాడంబరంగా(unassumed)చేస్తున్న కృషే. ఆ కృషిలో ఆరితేరిన వాడే ఉత్తమకవిగా గణ్యతను పొందుతాడు. లేనివాడు కాల గర్భంలో కలిసి పోతాడు. ప్రతిబావంతుడైన ప్రతికవీ అను పూర్వీక భాషాభివ్యక్తి ప్రభావాలనుంచి, దుర్మోహాలనుంచీ తన కవితాహృదయాన్ని సంరక్షించుకోవలసిందే!

ఈ విశిష్ట పరిణామం బాజా భజంత్రీలతో ఊరేగుతూ సాగేది కాదు. నిశ్శబ్ద జీవవాహినిగా సాగుతుంది. కవితాగత భాషా పరిణామం గురించి ప్రఖ్యాత విమర్శకుడు C. M.Bowra ఇలా అంటున్నాడు"కవిత్వంలో ఆధునిక ఉద్యమం చారిత్రకంగా తత్పూర్వదశల అవశేషాలతో సంఘర్షించి బయట పడ్డదే" [The modern movement in poetry can be regarded historically as a reaction against what Preceed it - The creative Experiment ]

కన్యాశుల్కం మహానాటకాన్ని ముత్యాలసరాలనూ సమకాలీన సజీవ భాషాభివ్యక్తిలో నూత్న సంవిధానాలతో రూపొం

దించే సంకల్పాన్ని శ్రీ గురుజాడ మహాకవి బౌరా చెప్పిన ప్రతి చర్యగానే స్వీకరించాడు. అలాగే వెంకటపార్వతీశ్వర కవులూ, శ్రీ రాయప్రోలు సుబ్బారావూ పంథొమ్మిదో శతాబ్దివరకూ సాగి వచ్చిన ప్రాబంధికుల క్షీణభాషా పటాటోపం నుంచి తమ కవితా హృదయమును విముక్తం చేసుకున్నారు. వినూత్నభాషా బంధాన్ని కల్పించుకున్నారు. లలిత హృదయ తంత్రీప్రకంపనం కలిగించగలిగారు. కనకనే వారి కావ్యాలు ఆనాటి ప్రజా హృదయాలకు ఆమోదం చేకూర్చాయి. ఒకచారిత్రక పరిణామ దశలో నిశ్చలమార్గదర్శకాలుగా నిలిచాయి.

అలాగే శ్రీయుతులు కృష్ణశాస్త్రి, నండూరీ, బసవరాజూ ప్రభృతులు తమకెదురైన తెలుగును కవితా పరిభాషగా రూపొందించుకోవడంలో నవీనప్రపంచ నాగరిక భాషల స్థాయికి మొద్దుబారిన తెలుగును ఉద్ధరించుకోవడంలో విశిష్టప్రణుతి గడించారు.

ప్రతిభావంతుని కెదురైన భాష ఎంత సనాతనమో అంత అధునాతనంగా భాసించి చిరంతన దీప్తి కలిగిస్తుంది. కాని అల వాటులో పాతబడిన భాషకు ప్రతిభావంతుడు సమూలంగా కుదిపి తిరిగి కలిపి నవశక్తిని ప్రతిపాదించాలి. తదనుసారంగా సాహిత్యంలో అతి ఉద్ధతికి వచ్చిన కవులందరి పట్లా ఈ సత్యకృత్యాన్ని ఋజువు చేయవచ్చు. అత్యాధునికులు శ్రీ శ్రీ, నారాయణ బాబు ప్రభుతులంతా విస్పష్టమూ, విశిష్టమూ అగు భాషాశక్తిని

కేంద్రీకరించుకున్నవారే. పాతభాషలో క్రొత్తశక్తిని ప్రోది చేసుకున్నవారే, కవితల మెరుపు తీగలందించినవారే.

ఆధునిక కవితాస్వరూపం సర్వదా నేడు వచన కవిత్వం అని పిలవబడుతోంది. కాని దురదృష్టవశాత్తూ ఈ పదం అపార్థాలకు తావిస్తోంది. ప్రతీ అపక్వవచన రచనా-కవిత్వమే అనుకొనే భ్రమకలిగిస్తోంది. ఫ్రీవెర్స్ అనే ఆంగ్లపదానికి సమానార్థకంగా హిందీ సాహిత్యంలో 'ముక్తచ్ఛంద కవిత' అని పిలుస్తున్నారు. ఇది అంతస్సత్వాన్ని వెల్లడించే చక్కని పదమే. స్వచ్ఛంద కవిత అనినప్పటికీ ఫరవాలేదు. ఫ్రీవెర్స్ అనే ఆంగ్లపదం 'వెర్స్‌లిబర్' అనే ఫ్రెంచి పదానికి సమానార్థకంగా రూపొందింది. ఈ పదాలు రెండూ వస్తుతత్వాన్ని ద్యోతకం చేస్తున్నాయి. వెర్స్ నిర్మాణంలో స్వేచ్ఛను ప్రతిపాదించడమే వీటి లక్ష్యం. కాని వచన కవిత అనే పదం సిద్ధపరిచినట్లు-కవిత్వానికే సంపూర్ణ స్వేచ్ఛనిచ్చి, వదలివేయడమనే దురర్థం సంభవించదు. కవితను గణబద్ధంగా కాక గుణబద్ధ స్వరూపంతో తీర్చిదిద్దడమనే దీనిభావం. కవితాభివ్యక్తికి నూతనావకాశాల అన్వేషణలోనే ఈ ప్రయోగం ప్రాదుర్భవించింది.

ఇతః పూర్వం కవితా వాహనంగా స్థిరపడిన పద్యానికి, అనవసరమైన మేకుబందీలు, పాదపూరణాలు, గణ యతి ప్రాస శృంఖలాబద్ధ ఆవరణలు కవి భావాన్ని చిత్రచిత్రంగా మెలికలు తిప్పుతూ నిర్జీవం చేశాయి. ఈ దశలో పద్యంలోగల గేయ

గుణాన్నీ, ప్రవాహశీలతనీ, ఊపూతూగూ వంటి శయ్యాసార ళ్యాలనూ స్వీకరించి ముక్తచ్ఛంద కవిత ఒక నూత్న ఓజస్స్వ రూపంగా మనకి లభించింది. ఈ ప్రక్రియ తెలుగు భాషలో ఉజ్వల భవిష్యత్తును వాగ్దత్తంచేస్తూ వర్ధిల్లిన నూతన వధూటి.

ఆధునిక భావన తన ఆవరణను పెంచుకుంది. వస్తువుకు గల మూడు ప్రమాణాలు కాక కాలాన్ని నాల్గవ ప్రమాణంగా స్వీకరించి కవితకు అన్వయించుకుంది. సాపేక్ష సిద్ధాంతం రూపొంది ప్రపంచ వైజ్ఞానిక గమనాన్ని తారుమారు చేసిన ఈ యుగంలో ఇది సహజ పరిణామమే. అల్లే డార్విన్ ప్రతి పాదించిన జీవపరిణామ సిద్ధాంతం గానీ, ఫ్రాయిడ్ ప్రతిపాదిం చిన మనస్తత్వ విశ్లేషణా సిద్ధాంతం గానీ, మార్క్స్ ప్రతిపా దించిన గతితార్కిక చారిత్రక భౌతికవాదం గానీ ఆధునిక కవితా చేతనను నిర్ధరిస్తున్న ఆధారభూములు.

ఇలా నవనవోన్మేషంగా సాగిపోతున్న ఆదునిక యోజనా మార్గాలను ప్రాచీన చతుష్పాత్తులు భరించలేవు. కొత్త భావాలను పాత కవితా స్వరూపాలు నిర్వహించలేవు. ఈ అశక్తతను గుర్తించడం వల్లనే ఈ యుగంలో కవిత కొత్త తెన్నులను అన్వేషించుకొని చేబట్టవలసి వచ్చింది. ఈ కారణం వల్లనే అచిరకాలంలో స్వచ్ఛంద కవిత అగ్రపీఠిపై అధివసించ గలిగింది. మనస్ఫూర్తిగా అంగీకరించలేని ఛాందసులు, ఎంత ముక్కినా మూల్గినా–వందలాది సంవత్సరాల సంప్రదాయంలో

స్థిరంగా నిలచిన చతుష్పాదుల్ని తోసి రాజన్నవి. పాదనియమాలతో, అక్షరగణ ప్రాధాన్యతతో సాగిన పద్యాన్ని ఆధునిక కవిత నిషేధించింది. స్వచ్ఛంద కవితా వాహికలో కావ్యాత్మ విముక్తమై అభివ్యక్తిలో పుష్కలత్వాన్ని సముపార్జించుకుంది స్వేచ్ఛగా భావావిష్కరణకు చక్కని అవకాశాలేర్పరుచుకుంది.

ఈ అవగాహనతోనే తప్ప వచన కవిత అంటే ఎవడు ఎలా రాసినా చెల్లిపోయే లైసెన్సుగా దీనికి గౌరవం చేకూరడం లేదు. మా తమ్ముడు స్వర్గీయ శశాంక అన్నట్లు– "ఎక్కడో వెయ్యి సంద్రాలలోతుగా పవళించిన స్మృతులను కదల్చడానికి వచన కవితనే సాధనగా స్వీకరిస్తున్నారు." అన్నది గమనార్హం. అచ్చమైన కవిత్వాన్ని ఏ స్వరూపంలో నిబద్ధించినా కవికి సంపూర్ణ స్వేచ్ఛ అనేది ఎన్నడూ లభించదు. నియమిత స్వేచ్ఛలో మాత్రమే సంయమిత సౌందర్యం ఆవిష్కృతమవుతుంది.

ఏ సంవిధానం గాని ఏ స్వరూపం గాని స్వభావ సంబంధమైన సురభిళాలతో తప్ప గాలిలో బ్రతకదు.

ఒక కవిత మనకు ఆనంద మిచ్చిందంటే-అది స్వభావ స్వరూప సమ్మేళనగా మాత్రమే మనకు ఆహ్లాదమిస్తున్నదని అర్థం.

విడివిడిగా స్వభావమో, స్వరూపమో ఎవరికీ ఎప్పటికీ శాశ్వతానందాన్నివ్వవు. ప్రతిభావంతుడైన కవి వినూత్న ఇతి

వృత్తానికి వినూత్న సంవిధానాన్ని సహజోన్మీలనంగా అమర్చుకుంటాడు. సుందరమైన దేహంలో ఆరోగ్యవంతమైన ప్రాణం ఉన్నపుడే మనిషి అని పిలుస్తాం. ఈ రెంటిలో ఏది లేకపోయినా శవమో, దయ్యమో అవుతుంది. కనక ఈ రెంటినీ విడదీసి దేనికో ఒకదానికి అధికప్రాముఖ్యత నివ్వడం వెర్రితనం.

ప్రయోగ శీలి యైన కవి తనకాలం నాటికి లేని వినూత్న కవితా ఖండాల్ని సృష్టించాలి. సాహిత్యంలోనూ, సమాజంలోనూ నూత్నకాంతుల్ని విరజిమ్మాలి.

మానవుల రసభావాలు ఏ కాలంలోనివైనా మౌలికంగా ఒక్కటే. సమాజ వ్యవస్థలూ, పరిసరాల గురించిన తాత్విక అవగాహనలూ, విశ్వాసాలూ మారగలవు. కాని సమాజంలో చెలామణీ అయ్యే భాషా పరమయిన రసభావ సంబంధి మూల ధాతువులలో ఆకస్మికంగా గొప్ప మార్పులు వచ్చిపడుతూ ఉండవు. ప్రధానంగా బాషపైననే ఆధారపడే కవిత్వ కళలో ఎప్పటికప్పుడు అపూర్వ పునస్సృష్టి మాత్రమే సాధ్యమవుతుంది. అంతే! మానవ చరిత్ర ఎంతకాలం సాగినా దేహ స్వరూపంలో విశేషపరిణామం సంభవించనట్లే-పూర్తిగా పాత దానిని వైదొలగించి, దాని స్థానంలో కొంగ్రొత్త స్వభావ స్వరూపాలను నెలకొల్పుదామనుకోవడం భాషాపరంగా అసాధ్యమే. టి.ఎస్. ఎలియట్ చెప్పినట్లుగా ఏ కవి అయినా తాను అపూర్వ భాషనో, అపూర్వ కవితాభివ్యక్తినో, నూత్నరసభావ

వ్యక్తీకరణ విధానాన్నో-సృష్టించాననుకోవడం ఆటవిక దశకు తిరిగి వెళ్ళిపో చూడడమే తప్ప అన్యంకాదు.

ఏ పద్ధతికి చెందిన కవిత్వమైనా కవులలో మూడు రకాల వాళ్ళుంటారు. అందులో మొదటి రకం కవులు ప్రయోగ శీలురు. కవితా స్వభావాన్నీ స్వరూపాన్నీ అపూర్వంగా ఎన్నిక చేసుకుంటారు. వినూత్న అభివ్యక్తి పరికరాలనూ, సంవిధానాన్నీ తమకు తాముగా సృష్టించుకుంటారు.

రెండో రకం కవులు సంవిధానాన్ని తమ పుట్టుకకు ముందే సంసిద్ధమయిన దాన్ని స్వీకరిస్తారు. అయినా ఇతివృత్తాన్నీ రీతిని, అభివ్యక్తినీ సంపూర్ణంగా నూత్నత్వంతో భాసించేటట్లు జాగ్రత్త వహిస్తారు.

మూడోరకం కవులు ఇతివృత్తాలలో గాని, సంవిధానాదులలో గాని తమంత తాముగా ప్రయోగశాలనుంచి వెదికి తెచ్చుకునే కష్టానికి గురికారు. తమ పూర్వులు ఎన్నోసార్లు స్వీకరించిన ఇతివృత్తాన్నే, తమ పూర్వులు ప్రయోగించిన సంవిధానంలోనే టన్నులకొద్దీ కవితల్లుకుంటూ పోతారు.

ఈ మూడోరకం వారిలో చాలా అరుదుగా మాత్రమే పూర్వ సంవిధానంలోనైనా, అభివ్యక్తిలోనైనా అభివృద్ధి ప్రదర్శించగలిగే శక్తిమంతులుంటారు.

తన కాలం వరకూ ఉన్నదాన్ని పూర్తిగా ఆకళించుకొని తన కాలం నాటికి లేనిదాన్ని సృజించి అభివృద్ధి చేయడమే-

అచ్చమైన కవి సాధించే వినూత్న శక్తిగా పరిగణన పొందు తుంది.

కాలానుగుణంగా పదాల అర్థాలలో విపరిణామం సంభవించవచ్చు; వాటి రంగులూ రుచులూ మారవచ్చు; సంతరించుకున్న మార్పులలో నిర్దిష్టత, స్పష్టతలు ఏర్పడవచ్చు; అన్యభాషలనుంచి అవసరార్థం కొత్తపదాలు వచ్చి చేరవచ్చు; పాతపదాలు చెలామణీ నుంచి పూర్తిగా వైదొలగి పోనూవచ్చు. అంతే తప్ప ఒక భాష మౌలికగుణమే మారిపోదు. భాషపైనా, ప్రజల నానుడిపైనా, సంభాషణా క్రమంపైనా, వాక్యనిర్మాణం పైనా ఆధారపడే కవితా రచనలో ఎప్పటికప్పుడు అపూర్వ పునస్సృష్టి మాత్రమే సాధ్యమవుతోంది.

ఆనుపూర్వికంగా వస్తున్న సమకాలీన భాషనుంచీ, అభివ్యక్తి విధానాల నుంచీ తనకు ఉపయుక్తమైన భాషను ఆవిష్కరించుకొని నూత్న ఓజస్సును సంతరించుకున్నాడు శేషేంద్రశర్మ. తన ఇటీవలి కావ్యాలు శేషజ్యోత్స్నలోగాని, మండే సూర్యుడులో గాని ఈ నూతనోజస్సును సాధించాడని నిశ్శంసయంగా వివరించడానికే పైన అంతగా చర్చ చేయవలసి వచ్చింది.

ప్రాచుర్యంగా చెలామణీలోఉన్న సమకాలీన జీవద్భాష నుంచీ, సమకాలీన కవితా పరిభాషనుంచీ మాత్రమేకాక తన సృజనాత్మక కృషిలో గత ఇరవయ్యేళ్ళుగా తన కవితా

హృదయాన్ని రూపొందిస్తూన్న స్వీయ కవితా పరిభాష నుంచీ (Poetic idiom) పలుకుబడి నుంచీ ఈ స్వేచ్ఛను సాధించాడు.

కవులు తామేదో గొప్ప తాత్వికుల మన్న పోజుతో ప్రభు సమ్మితమైన పద్ధతులతో బోధకులు కాగూడదు. తమ గుప్త హృదయానుభూతుల్ని వీలయినంత కళామయంగా ఆవిష్కరించుకుంటే చాలు. తమ సుప్తచేతనలో రహస్యంగా గుడిసుళ్లు తిరిగే అనుభూతార్థ స్మృతుల్నీ వాసనలనీ, గుప్తాను భూతుల్నీ తేజోరాజితంగా చేదుకోగలిగితే చాలు. ఈ అవగాహన శేషేంద్రకు పుష్కలంగా ఉన్నది.

వినూత్న కవితాభివ్యక్తికి అనుకూలమైన, భాషాపరమైన, నూతన సంకేతాలను ఉత్తమ కవి సర్వాతిశాయిగా స్థాపించుకుందుకు ప్రయత్నించాలి. ఈ అవసరాన్ని శేషేంద్ర గుర్తించాడు.

1943లో ప్రారంభమయిన అభ్యుదయ కవితా ఉద్యమం ఆంధ్రసాహిత్యంపై గాఢముద్రలను కలిగించింది. 1950 ప్రాంతం వరకూ ఇందలి ప్రతి తేజస్వీ నవ్యప్రయోగాలు సంతరించి చిరయశస్వీగా నిలిచాడు. విప్లవం, వర్గపోరాటం, దోపిడీ, బూర్జువా వర్గం, జనశక్తి, తరతరాల పీడన, రక్తమూ, కన్నీరూ, వంటివి కొత్త కవి సమయాలుగా స్థిరపడి నూత్నకాంతులీనని క్షీణలక్షణాలుగా ప్రవర్తిల్లాయి. అభివ్యక్తిలో మార్పులేక స్తంభించింది. భావతరంగాలు కలిగించలేక కేవల

పదాలుగా శక్తి విరహితాలయ్యాయి. ఈ పరిస్థితి అచ్చంగా C. M. Bowra విశ్లేషించిన ఈ క్రింది వాక్యంతో అన్వయించుకోవచ్చు. ఆయన ఇలా అన్నాడు : 'As soon as an art reaches the limits of its idiom, it is doomed to become moribund and to hamper creative work.' నిజమే కళాస్వరూపం దాని అభివ్యక్తి సాధనాల సీమలను పరిపూర్ణంగా ఆక్రమించే సరికి దానిలోంచి ఒక క్రొత్తమార్పు రాకపోతే నిస్తేజమై శిలీభవిస్తుంది. సృజనాత్మక కౌశలానికి భంగం కలిగిస్తుంది. విస్తృత భావాభివ్యక్తి చేయజాలని దుస్థితిలో ప్రక్రియా పరభూతమైన ముక్తచ్ఛందం వైపుగా రచయితలంతా మొగ్గుచూపడానికిదే కారణం.

ఆ సన్నివేశంలో 'ఫ్రీవెర్స్ ఫ్రంట్' అనే మినీ సంస్థ ఒకటి హైదరాబాదులో స్థాపించబడింది. కాలేజీలలోనూ, యూనివర్సిటీలోనూ చదువుకొంటున్న యువ రచయితలను ఆకర్షించింది. నగరజీవన కల్లోలాన్నీ, వర్తమాన నాగరికతలో కొట్టవచ్చినట్లు కనిపించే ఆర్థిక వ్యత్యాసాలనూ యువ హృదయం ప్రతిబింబించ నారంభించింది. దీనితో తెలుగు కవితా రంగం కొంతవరకైనా కొత్తశక్తిని పుంజుకోనారంభించింది. కాని దీనితోపాటు పొల్లుకూడా విశేషంగా రాకపోలేదు. ఈ కొత్త కోడి పుంజులు చెత్తచెదారాలను కెక్కరించకపోలేదు. కేవల ప్రక్రియా సౌలభ్యానికే ఆకర్షితులయిన అర్భకులు తొందరగా కీర్తిని సంపాదించవచ్చునని అర్రులుసాచ నారంభించారు.

ప్రాథమికంగా కవితా సాధనకు అత్యవసరమైన ఇతరేతర నైసర్గిక జీవలక్షణాలను పెంపొందించుకుందుకు శ్రద్ధవహించలేక పోయారు. వారికి మార్గచోదకులైనవారు-కవితకు అవసర మయ్యే ప్రాథమిక లక్షణసామగ్రి పట్ల వారిని ఉత్సుకులుగా చేయలేకనూ పోయారు.

ఈ విధంగా తిరిగి ఈప్రక్రియలో కూడా గతాను గతి కత్వం వ్యాప్తమయింది. అంధత్వం ప్రబలింది. అటు నన్నయ్య గారు నెలకొల్పిన లిరికల్ కవితాధోరణికి ఆధునిక ప్రతినిధిగా తిలక్ దర్శనమిస్తే వస్తుకవితా సంవిధానంలో తిక్కన మార్గాను యాయిగా కుందుర్తి కనిపించాడు. యువరచయితలు రెండు వర్గాలుగా చీలి వీరిరువురినీ అనుకరించనారంభించారు. ఈ అను కరణ వర్గీయులు మితిమీరడంతో మళ్ళీ ఆధునిక కవిత సార్వత్రిక నిరాదరణకు గురికానారంభించింది. ఆధునిక కవులు ఎంత కీర్తిమంతులవుతూ వచ్చారో, అంతకంతా ఆధునిక కవిత జన బాహుళ్యం నుంచి దూరమవుతూ వచ్చింది. దీనికి ప్రధాన కారణమేమిటా అని సర్వులూ ఆలోచించ నారంభించారు.

పూర్వ యుగాలలో కవిత ప్రజాదరణ పొందడానికి ప్రధాన కారణం కథా కథనానికి వాహకంగా ఉండడమేనని, ఆ సంవిధానాన్ని పునరుద్ధరించాలని ఒక వాదం తలెత్తింది. ప్రస్తుత యుగంలో ముద్రణాయంత్ర ప్రభావంవల్ల కథా కథనం తన రంగభూమిని పద్యం నుంచి గద్యానికి మార్చుకుంది. ఆంగ్ల సాహిత్యం ప్రభావంతో కథానికలూ నవలలూ ప్రవర్థిల్లాయి

వీటితో నిండిన దిన వార మాస పత్రికలు ఆర్థికంగా పుష్టి చేకూర్చుకో నారంభించాయి. వీటికి పాఠకులు లక్షల సంఖ్యలో పెరిగారు. ఈ ప్రక్రియలకు అంకితమయిన రచయితలకు రచయిత్రులకు ఆర్థికంగానూ సాంఘికంగానూ ఆదరణ పెరిగింది. కవిత్వం వానాకాలపు చదువుగా మారిపోయింది.

ఈ సంగతిని గుర్తించడం కూడా కొందరు కవులకు ఆధునిక కథన కావ్యాలుగా వచనకవితలు రూపొందాలన్న ప్రచారానికి వెసులుబాటు కలిగించింది. ఈ వర్గానికి కుందుర్తి ప్రధానుడు.

కవిత్వం మళ్ళీ వెనక్కి వెళ్ళి కథను ఆశ్రయించడం వల్ల తన పరపతిని కోల్పోవడమే తప్ప సాధించ గలిగే ఉత్కృష్ట ప్రయోజనమేమీ ఉండదని కొందరు వాదించారు. దీనికి శ్రీ వాల గంగాధరతిలక్ ప్రధానుడు.

ఈ గొడవంతా పదేళ్ళక్రితం చల్లారింది. దీనికి కొంత కారణం శ్రీ తిలక్ మరణం. ఆ మహానుభావుడు చచ్చి సాధించాడు. కథన కావ్యాలు కావాలని శాకాలూడిన వారే నోరు మెదపకుండా ఊరుకున్నారు. ఒకటో రెండో కథనకావ్యాలు వచ్చినా వాటి గొంతులు మరీ పీలవై కన్నవారికే విని పించనంత విస్మరణీయాలయ్యాయి.

సార్వత్రికంగా కవితపట్ల, ప్రత్యేకంగా ముక్తచ్ఛంద కవితపట్ల ప్రజాకర్షణను పునరుజ్జీవింప చేసే మార్గమేమిటా అన్న

ఆలోచనలో కొందరు కథనకావ్యాలవైపు చూపులు నిగిడిస్తే మరికొందరు కవిత మరింత తీవ్రంగానూ సెన్సేషనల్‌గానూ ఉద్రేకపూరితంగానూ మరాద్యస్తులకు విద్యుదాఘాతం కలిగించే రీతిగానూ బూతును అభివ్యక్తి సాధనంగానూ, మార్చుకొని విస్తరించనారంభించింది. ఈ విధంగా ఆధునిక కవితా సంవిధానానికి ఈ ఇరువర్గాలవారూ విదూరులయ్యారు. కేవలం ఏదో విన్యూత్నత్వాన్ని నెలకొల్ప గలమనుకునేవారు గెథేమహాకవి చెప్పిన ఈ వాక్యాలను మననం చేసుకోవడం అవసరం: "People are always talking about originality but what do they mean? As soon as we are born, the world begins to work upon us, and goes on to the end. And afterall, what can we call our own, except energy, strength and will? If I could give on account of all that I owe to my great predecessors and contemporaries, there would be but a small balance in my favour" - Goethe.

ఈ రహస్యాన్ని చాలా చక్కగా గ్రహించాడు క్షేమేంద్ర కవి. పైగా సకల కవితా కళా రహస్యాలను అవలోకన చేసిన వ్యుత్పన్నుని కోసం ఆధునిక కాలం గళమెత్తి పిలుస్తోంది. ఆ పిలుపునందుకున్నాడు క్షేమేంద్ర. అతడా బాల్యాదిగా సంస్కృతాంధ్ర ఆంగ్ల కవితా రహస్యాలను పరిణత భావుకులైన పితృపాదులనుంచి నేర్చుకున్నాడు. వాల్మీకి రామాయణాన్ని శ్రీహర్షుని నైషధచరిత్రనీ గళగ్రాహిగా ఆపోసన పట్టి అపూర్వ అర్థావగతులను అన్వేషించి పారంగతుడైన వ్యుత్పన్నుడు.

పనివడి నారికేళ ఫలపాకమునన్ చవిహైన భట్ట హా
ర్షుని కవితాను గుంభనము సోమరిపోతులు కొందర
య్యలో
నని కొనియాడ నేరరది, ఎట్టిద? లే జవరాలి చెక్కు గీ
టిన పసవల్చు బాలకు డెందమునన్ కరగంగ నేర్చునే?

అని శ్రీనాథమహాకవి తన శృంగార నైషధానికి ఉపోద్ఘాతంగా చెప్పినట్లుగా బాలకులు అర్భకులు సోమరిపోతులు అగు కొందరయ్యలు కవితాసాధనకు వ్యుత్పన్నతాభూమిక అవసరం లేదనడం దఫ దఫాలుగా ఆధునిక కవితలో అంధత్వ వ్యాప్తికి కారణమవుతున్నదని శేషేంద్ర గుర్తించాడు.

అత్యంత వేగంతో మారిపోయే జనాభిరుచికి ఈడుగా కవుల ప్రయోగ శాలిత్వం అమరకపోవడం కూడా మరొక ప్రబల కారణమే. ఏ ప్రయోగమయినా ప్రజల అవగాహనా క్షేత్రానికి ఇంకేసరికి పదిసంవత్సరాలు పట్టే అంత అయోమయ సన్నిభం కావడమూ మరొక కారణంగా అతను గ్రహించాడు. కవులు కవితా రచనకు సద్యఃస్ఫూర్తిగా ఉద్యుక్తులవడమే కాక సమాధి నిష్ఠులై క్షీణత్వం నుంచి ఆధునిక కవిత్వాన్ని సముద్ధరించ గలిగే పద్ధతులులేవా అన్న గవేషణా యత్నచిత్తులు కావలసిన అవసరం ఉన్నదన్న చైతన్యంతో అతను నూత్నకవితా సృజనోత్సవానికి ప్రారంభం చేశాడు.

సమీప గతంలో ఆంధ్ర కవితా రంగం సకలకల్లోల భూయిష్ఠమైంది. దానినుంచి విముక్తిని సాధించడానికి అందరూ తమకు

తోచిన మార్గాలు సూచించ నారంభించారు. ఈ అన్వేషణలో కొందరు సిద్ధాంత రాద్ధంతాలను తిరగతోడి విమర్శవ్యాసాల కుపక్రమించారు. ఈ వైమర్శిక పరిశోధనలలో సైతం శేషేంద్ర అత్యంతాధునిక విమర్శమార్గాలను ఎంత పటిష్ఠంగా పరిశోధించాడో తెలుసు కుందుకు అతని రక్తరేఖ ఎంతో సహాయ పడుతుంది. ఆధునిక కవితా విమర్శకులలో అర్చిబాల్డ్ మేక్లిష్ వంటి అమెరికన్ కవులు సిద్ధాంత వేత్తలై ఎన్నో కొత్తదారులు నిర్మి ంచారు. మెక్లిష్ రచించిన Poetry and Experience వంటి ఉత్తమ గ్రంథమూ సి. ఎమ్. బౌరా రచించిన Creative Experiment వంటి ఉత్తమ గ్రంథమూ శ్రీ శేషేంద్రకు గాని ఈ వ్యాసకర్తకు గాని తమ ఆలోచనలకు ఎంత పదును పెట్టినదీ విస్మరించవలసినది కాదు. ఈ నూతన మార్గంలో మన ఆధునిక కవిత ప్రయాణిస్తే కవిత కేవలం మ టలకుప్పలుగా కాక మాటల బొమ్మలుగా భావనా చిత్రాలుగా తన ఉపసధాతువును మార్చు కొని కొత్త రూపు రేఖలను దిద్దుకోగలదనే నిశ్చయానికి కొందరు కవులు వచ్చారు. ఇట్టి నూతన విశ్వాసమూ నవీన సంవిధానమూ కలవారిలో నేడు ఉజ్వలమైన కవితలు వెలార్చి 'మండే సూర్యుడు' గా మనముందు నిలువెత్తు వ్యక్తిత్వంతో నిలచిన వాడు శేషేంద్ర!

ఆధునిక అన్వేషకులలో కొందరు కవిత్వంలో కసిత్వమూ నగ్నత్వమూ కోరగానివేనని, పాఠకుని మననశీలతకు ఉపకరించ వని అంగీకరించి తమ పథాన్ని మార్చుకొని తరుణ విప్లవమే

శరణ్యమన్న నిర్ణయంతో నక్సలైట్ల దుందుడుకు మార్గానికి కవిత ద్వారా నిబద్ధత ప్రకటించుకున్నారు.

వర్తమానకాలంలో సాహిత్యరంగం మరింత సంక్షోభ పూరితం కావడానికి మాత్రమే ఇది సహకరించింది. అయితే ఈ కల్లోలానికి తమవంతు సహాయాన్ని అందిస్తున్న ఇతరేతర సాహితీశక్తులు ఒక సత్యాన్ని విస్మరిస్తున్నారు. ఈ సంక్షుభిత వర్తమానం పాతికేళ్ళలోపుగా ఇరవై ఒకటవ శతాబ్దాన్ని కన డానికి ఊనమోసి ఉన్న మాలింత. ఇట్టి చారిత్రకదశలో వర్తమాన కవులు ఆగామి తరాలకు (Posterity) అందించనున్న ఉత్తమ వారసత్వం ఏమిటా అన్న విచికిత్సలో తలమునకలు కావలసి ఉన్నది. ఇట్టి పరిస్థితులలో ఈ శేషేంద్రకవి నిర్వహిస్తున్న పాత్ర ఏమిటి అనేదే ఈ ముందు పుటలలో చర్చనీయాంశం.

ఈ కవి సాంప్రదాయక కవితా సాధనలోనూ భారతీయ మహాకావ్యాల పరిశోధనాత్మక పరామర్శన కృషిలోనూ పరిపక్వ హృదయుడు. 1950 ప్రాంతంలో పిఠాపురంలో 'సాహరబ్' అస్మదాది కవిమిత్రుల ప్రోత్సాహంతో కవికులాంకర శ్రీ ఓలేటి పార్వతీశం గారి పరిచయ పీఠికతో మావూరి నుంచే ప్రచురిత మైంది. తదాదిగా ఆయన సాహిత్య పఠనపాఠనాలు విరమించ లేదు. ప్రాచ్యపాశ్చాత్య ఆలంకారిక రీతులను కవితారీతులను క్షుణ్ణంగా అధ్యయనం చేసి జీర్ణించుకున్న పండితుడాయన.

పాండిత్యం అతివేలమయ్యే సందర్భాలలో ఆర్ద్రహృద యాన్నీ సృజనాత్మకశక్తినీ కుంఠితమొనర్చి బుద్ధిని గిడస

జారింకడం సాధారణంగా కనిపిస్తూ ఉంటుంది. కాని ఇతని విష యంలో అది కవితా కళాప్రసన్నతకీ, పరిపూర్ణ భావుకత్వానికి దోహదం చేసింది.

ఇటు పుంఖాను పుంఖాలుగా కవితలనూ, అటు తన విశ్వాసాలనూ సిద్ధాంతాలనూ ఆంధ్రాంగ్లాలలో హృద్యమైన లక్షణ వ్యాసాలు గానూ వెలువరిస్తున్నాడు. 1974 లో విడుద లైన 'రక్త రేఖ' అనే Poet's Note Book లో సాహిత్యం గురించీ సమాజం గురించి ఎన్నో ఆలోచనాత్మక విషయాలను పొందుపరచాడు.

శ్రీ శేషేంద్ర కవితా వాల్లభ్యం గురించి చర్చించే ముందు అతని కవితాదర్శనకు భూమికలుగా యోచనాపుష్టి చేకూర్చే అతని అభిప్రాయాలను వాచవిగా పరిశీలించడం అతని కవితా వైఖరిని అవగాహన చేసుకుందుకు దోహదం చేస్తుంది. ఆయన వివిధ సందర్భాలలో వివిధాంశాలపై తన అభిప్రాయా లను వ్యక్తం చేశాడు. ప్రాక్ప్రతీచీ దార్శనికుల అభిప్రాయాలను వ్యాఖ్యానించాడు. అన్నిటికి కళాసాహిత్యాది (Aesthetics) సమస్యల పట్ల ఏకసూత్రత ఉంది. ఉదాహరణగా ఈ క్రింది వాక్యాలు పరిశీలనార్హాలు:

1. సాహిత్యం ఒక పరమార్థసాధనకు సాధనం మాత్రమే. పరమార్థం మంచిలోకం......

2. జ్ఞాన చక్షువు చూసింది చెపుతాడు కవి. చర్మచక్షువు చూసింది చెపుతాడు అకవి. అయితే యిక్కడ ఒక సూక్ష్మం-

కవితో పాటు ఋషికి కూడా జ్ఞానచక్షువు సమాన ధర్మంగా ఉంది. అయితే అది తత్త్వదర్శనం వరకే. ఆ తర్వాత ఎవరి దారి వారిది. ఆ దర్శనాన్ని సామాన్య భాషలో చెపుతాడు ఋషి. తద్భిన్నమైన విలక్షణ భాషలో చెపుతాడు కవి. కవి శబ్దాల్లో ఉన్న అసామాన్యశక్తుల్ని కొల్లగొడతాడు.

3. ఎప్పుడూ కవిత్వం జ్ఞాపకానికి నిలవాలి. కాగితంచూచి చదవకుండా నోటితో చెప్పబడగలగాలి. ఒక మాటల గుంపు కవిత్వం కావడానికి అత్యవసరమైన లక్షణాల్లో ఇదొక ప్రధాన మైన లక్షణం. మరి ఈ జ్ఞాపకం పెట్టుకోబడే శక్తి ఎలావస్తుంది. కవిత్వానికి? చెప్పదల్చుకున్నది సంగ్రహంగా, విలక్షణంగా, వింతగా ఉండాలి. సంగ్రహతలో బంధం వస్తుంది. విశిష్టతలో పోల్చుకోబడిన వ్యక్తిత్వం వస్తుంది....

4. Modern Poetry shifts its emphasis from the limited Canvas of the individual to a wider canvas of Mankind; Its movement and thinking in which 'Man' is posited in a spot...

5. ఇది హిమాలయాల కాలంకాదు. ఈనాడు తేనెటీగల కంటే ఈగలకే విలువ; మండే సూర్యుడికే శిలువ.

6. అసలు తెలుగు దేశం భావశూన్యమైన వృత్త రచనా వ్యామోహంలో పడి పదిశతాబ్దాలు గిలగిల కొట్టుకుంది. ఇంకా కొట్టుకుంటోంది....

7. నేనెగరాలంటే నా రెక్కలు నేను సర్దుకోవాలి. నేను పాడాలంటే నా గొంతు నేను సవరించుకోవాలి. నేను రాయాలంటే నా మాట నేను తెలుసుకోవాలి.

8. కవిత్వశాస్త్రం ఎందుకు చదవాలి? ఇదీ ప్రశ్న ఈ నాడు తెలుగుదేశంలో. ఇవేమీ చదకుండానే తాను రాసే చెత్త మహాకవిత్వంగా చెలామణీ అవుతుంటే పదవులూ, బహుమతులూ, తెస్తూవుంటే అవన్నీ చదివి చెమట పట్టించుకోవలసిన అవసరం ఏమిటి?

9. కవిత్వం స్థూలమైన భౌతిక స్వరూపం నుంచి దృష్టి పిండుకున్న తాత్త్విక బిందువు...

10. ఆర్చిబాల్డ్ మేక్లిష్ 'Poetry and experience' చదివితే పంచేంద్రియాలూ పారవశ్యంలో మునిగిపోతాయి. మాలిష్‌చేసిన కండరాలు ఎలా కలలుకంటూ నిద్రిస్తాయో అలా ప్రతిరక్త బిందువూ-ప్రవహిస్తూ ఉందో నిద్రిస్తూ ఉందో తెలియని దశలో తేలుతూ ఉంటుంది.

11. కవిత్వం రాజకీయ సిద్ధాంతాల కోసం చదవం. అదే దాని పరమార్థమైతే మార్క్సు, జయప్రకాష్, సుందరయ్య-వీళ్ళంతా మహాకవులనిపించుకోవాలి. నిజంగా ఆ సిద్ధాంతాలకు వాళ్ళే ప్రమాణం; కవులుకాదు. కాని ఆ సిద్ధాంతాల్ని కవిత్వంలో చెప్పాలంటే కవులే కావాలి. మార్క్సు ప్రభృతులు ఏమీ చేయలేరు. ఈ సత్యం తెలుగు దేశంలో సాహిత్యవాదుల కంటె రాజకీయవాదులకే బాగా తెలుసు...

ఇలా ఉల్లేఖించుకుంటూ పోతే ఆ పుస్తకంలోని అధిక భాగం తిరిగి రాయవలసి ఉంటుంది. కనక ఆ పుస్తకాన్ని ప్రతి వారూ కొని చదవమని మాత్రమే చెప్పి విరమిస్తాను. ప్రతి వారూ అంటే నా ఉద్దేశం ప్రతిగాడిదా అని కాదు-రాద్దామనీ ఆలోచిద్దామనీ కలలు కంటున్న వాళ్ళంతాను. ఆలోచనీయమైన అంశాలు రచితమైన గ్రంథంలో అన్ని విషయాలతోనూ అందరూ బేషరతుగా ఏకీభవించాలన్న నియమం లేదు. ఏకీభవించడమో లేకపోవడమో తేల్చుకుందుకు చదివి ఆలోచించాలి కదా ముందు! ఈ గ్రంథం నిండా కవిత్వం గురించీ, జీవితం గురించీ శ్రీ శేషేంద్ర చాలా విషయాలు చెప్పాడు, చర్చించాడు. అందులో చాలా విషయాలతో నేనేకీభవిస్తాను. అలా అన్నానంటే నేనేకీభవించని విషయాలుకూడా కొన్ని ఉన్నాయని అర్థం. ఉదాహరణగా ఒక విషయం చెప్తాను.

పైన ఉల్లేఖితమైన ఏకాదశాంశాలలో మూడవసూక్తితో నేను సగమే ఏకీభవించగలను. 'ఎప్పుడూ కవిత్వం జ్ఞాపకానికి నిలవాలి' అన్నదానికి వివరణ సబబుగాలేదు. మంచి కవిత్వం జ్ఞాపకానికి నిలుస్తుంది అంటే తు. చ. తప్పకుండా సర్వంకషంగా ప్రతివాడి జ్ఞాపకంలోనూ నిలిచిపోతుందని అర్థంకాదు. అందలి ఆత్మభూతమైన సారాంశం మన హృదయాన్ని పట్టుకుంటుంది. మన మనసాన్ని చూరగొంటుంది. అంతే! ఒక్కొక్కప్పుడు చాలా గొప్ప కవిత్వం ఒక్కొక ఉత్తమ భావుకుడికే జ్ఞాపకంలో నిలవక పోవచ్చు. జ్ఞాపకధారణా ఉత్తమ కవిత్వ మననం అనేవి

రెండూ రెండు విభిన్న ప్రజ్ఞలు. కొండొకచో ఏకదేశంకావచ్చు. (శ్రీ) దివాకర్ల వెంకటావధాని గారున్నారు. ఆయన చేతికో క చెత్తకవితా సంపుటినివ్వండి. ఆవిష్కరణ తమరే చెయ్యాలని చెప్పండి. ఆయన ఆ గ్రంథాన్ని ఒక్కసారి చదివేరంటే చాలు కళ్ళుమూసికొని గంటన్నర సేపు కావ్యమీమాంసలన్నీ ఏకరువుపెడుతూ సదరు చెత్త కవితా సంపుటి నుంచి వందలాది పంక్తులు అప్పచెపుతూ ఉపన్యసించగలరు. ఆ మహానీయుడుకి కంఠతావచ్చాయికదా, తన వచనపుతుంటలన్నీ మహాకవిత్వ మనుకొని ఆ కవిగాడు మురిసిపోతే-అలాంటివాడిని భగవంతుడు కూడా రక్షించలేడు.

ఉత్తమ కవిత్వం జ్ఞాపకానికి నిలవాలనడం-ఉత్తమ కవిత సహృదయ పఠిత హృదయ నిష్ఠంకావాలని అనునిత్యం అలరించాలనీ అతని స్మృతిభాండారంలో చేరి అతని వాసనలలో ఒక అంతర్భాగం కావాలని మాత్రమే అర్థం తప్ప ముక్కస్య ముక్కగా ప్రతీదీ ఒక్కసారి చదివిన వెంటనే జ్ఞాపకం ఉండిపోవాలని కాదు. ఒక వ్యక్తి తాలూకు జ్ఞానసామగ్రి పెరుగుతున్నకొద్దీ పుస్తకాపేక్షలేని మనోధారణ ఇంచుమించు అసాధ్యమే పైగా ఈ జ్ఞాపకశక్తి అనేది అందరికీ సమానంగా ఉండేదీకాదు.

ఉత్తమ కవిత్వం గతాన్ని జీర్ణించుకొని వర్తమానంలో పుట్టి సమకాలీన చైతన్యాన్ని గర్భీభూతం చేసుకొని ఆగతం వైపుగా సామాజికులను నడిపించాలి. సరిగ్గా ఈ లక్ష్యలక్షణ

సమన్వితమైన ఉత్తమకావ్యం శ్రీ శేషేంద్ర 1974 లో విడుదల చేసిన 'మండే సూర్యుడు.' ఆ కావ్యం తన ఉన్నిద్రతేజంతో రాగల ఇరవయ్యొకటో శతాబ్దికి తన చూపుడు వేలు నిగిడిస్తోంది. ఆ కావ్యపఠనమే ఈ రచయితకు ఉత్తేజమిచ్చి ఈ కవి పూర్వాపరాలను సమీక్షిస్తూ ఇంత సమాలోచనా రచనకు కారణభూతమైంది. ఆ కావ్యంలో వినూత్న కాంతులతో ప్రచలితమైన నూతన అభివ్యక్తులు సమకాలీన కవులపై విశిష్టమైన ప్రభావాన్ని కలిగించడమే ఆ కావ్యశక్తికి నికషోపలం.

'మండే సూర్యుడు' అనే కవిత 2-10-74 న హైదరాబాదు రేడియో కవిసమ్మేళనంలో మొదటిసారి ప్రసారమయింది. అప్పుడే గొప్ప సంచలనం రేపింది. అదే 13-11-74 ఆంధ్రప్రభ వారపత్రికలో 'మనిషిని చెక్కిన శిల్పి' అనే శీర్షికతో ప్రకటితమయింది. అందులోని 'చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తున్నై కొమ్మల్లో పూలై' అనే వాక్యాన్ని చెరబండరాజు ఇలా అనుకరించాడు. 'ఈ గడ్డమీద రాలిన శిరసులు ఎర్రరక్తం పూలు పూస్తున్నై' అని.

సూర్యుడు అనే ప్రతీక ఇతఃపూర్వం చాలా మంది కవులు ప్రయుక్తం చేసిందే అయినా మహత్తరశక్తి సంపన్నంగా ఈ 'మండే సూర్యుడు' అనే కవితలో ప్రచలితం కావడంవల్ల ఈ ప్రతీక చాలా మందిని ప్రభావితుల్ని చేసింది. సుధామ అనే యువకవి రాసిన 'ప్రతి మార్పూ సూర్యుడుగానే ఉదయిస్తుంది' కవితలో ఈ మండే సూర్యుని ప్రభావం అడుగడుగునా ద్యోతక

మానమవుతుంది. ఆ కవిత స్రవంతి డిశంబర్ 1974 సంచికలో ప్రచురితమైంది. ఈ సుధామ యువకుడు, కొత్తగా కవితా లోకంలోకి గొంతు విప్పార్చుకుంటున్నాడు, అలాంటి అర్భకులు శేషేంద్ర కవితా ప్రభావానికి లోంగి రావడంలో ఆశ్చర్యంలేదు. ఈ ప్రతిధ్వనికి సుధామదే 'ఎర్రబంతి' అనే మరో కవిత కూడా సాక్ష్యమిస్తుంది,

అంతేకాదు శ్రీ శేషేంద్ర తన శేషజ్యోత్స్నలోని కవితలను ఆంధ్రప్రభలో ప్రచురిస్తున్నప్పటి నుంచీ యువతరం కవుల కవిత్వ రచనామార్గం కొత్తపుంతలు తొక్కనారంభించింది. మండే సూర్యుడుతో యువతరం పూర్తిగా ప్రజ్వలితమైందని విస్పష్టంగా చెప్పడానికి ఎన్నో దాఖలాలున్నాయి.

'చీకట్ల దాస్యం ఛేదించుకుని
చుక్కలు నా వాక్యాలై సూర్యుడిలో కలవడానికి'
(నేను- మండేసూర్యుడు పుట:5)

'నక్షత్రాలూ చంద్రుడూ అన్నీ కూడబలుక్కుని
చీకటిలోంచి ప్రయాణం చేసి
నాకు సూర్యఫలాన్ని చవి చూపిస్తాయి'

అంటూ 'ఎర్రని బంతి' అనే శీర్షికతో సుధామ 'చేతన' 16-8-75 సంచికలో ప్రచురించాడు. అందులోనే మరొక ప్రతిధ్వని:

'రోజూ ఉదయాద్రి శిఖరంతో
రక్త కాంతులు చిందే గుండ్రని పాటని'

అని శేషేంద్ర పైకవితలోనే అంటే సుధామ ఇలా దానికి కవితా స్వరూపంలో తాత్పర్యం రాస్తాడు:

'నాలో రాత్రి కన్నీరుగా కరిగి
ధైర్యం తొలి ఉషస్సవుతుంది
ప్రకృతి కన్య ఒడిలోనుంచి లేవగానే
ధైర్యంగా ఆనందంగా ఆడుకోవడానికి
నాకు ఎర్రటి బంతి'.

ఉత్తమ కవితా కంఠం అర్భకులలో ప్రతిధ్వనులీనడం సాధారణమే. కాని లబ్ధప్రతిష్ఠులు కూడా ఆ ప్రభావం నుంచి తప్పించుకోలేక పోయారంటే ఆ కవితా కంఠం ఎంతటి శక్తి సంపన్నమో వేరే చెప్పనక్కరలేదు. శ్రీ శేషేంద్ర తన 'శేష జ్యోత్స్న' అనే కవితా సంపుటిని 1972లో ప్రచురించారు. 1971 లో (డిసెంబరు) ఆంధ్ర పత్రిక వార పత్రికలో ప్రచురితమైన 'వెన్నెల వ్యధ' కూడా శేషజ్యోత్స్నలో చేర్చబడింది. అందులో

'పూల నెత్తావులతో గాలి గుసగుస లాడుతోంది'

అనే కవితోక్తికి ప్రభావితుడై శ్రీ సి. నారాయణరెడ్డి

'పూలు గుసగుస లాడతాయని ఇప్పుడే తెలిసింది
గాలి గుసగుస లాడుతుందనీ ఇపుడే తెలిసింది'

అని '73 లో రాసిన ఒక సినిమా పాటలో అనుకరించాడు.

'నేను చెమట బిందువుని

కండల కొండల్లో ఉదయించే లోక బంధువుని'
అన్న శేషేంద్రశర్మ మండేసూర్యుడిలోని వాక్యానికి తరుణ మాస పత్రిక 1975 జనవరి సంచికలో శ్రీమతి నాయని కృష్ణ కుమారి ఇలా అనుకరించారు.

"నేను కాంతి బిందువును
అశాంతికి ఆత్మ బంధువును" అని అన్నారు.

'గుండెలతో నాకు దోస్తీ' అనే శేషేంద్ర శబ్ద సంబంధి స్మృతికి ఈమె 'కాలం గుండెల్ని గాలంగా గుచ్చే నేను కిరణ శరీరాన్ని' అన్నారు.

శేషేంద్ర కవితా జాలం సహృదయసమాహారంపై ఎంత శక్తివంతమైన ప్రభావం కలిగిస్తున్నదో చెప్పడానికి మాత్రమే పై ఉదాహరణలను స్థాలీపులాకంగా ప్రదర్శించడం జరిగింది తప్ప అన్యథా వేరే దురుద్దేశమేమీ లేదు. శేషేంద్ర కవితా జాలం వైయక్తిక వైశిష్ట్యంతో ఎలా ఉదీయమానమవుతున్నదీ ముందు ప్రకరణాలలో సమాలోచించిడానికి ప్రయత్నమే ఈ రచన ముఖ్యోద్దేశం.

——

రెండవ ప్రకరణము :

# శేషేంద్ర కవితలో జీవన మధూళి

శ్రీ శేషేంద్ర శర్మ 1970లో ప్రచురించిన 'పక్షులు' అనే కవితా సంపుటిని చెరుకువిల్లు అనే కవితతో ప్రారంభించాడు. ఇది అనవద్యమై వ్యాఖ్యాపేక్షమైన కవిత ఈ కవిత ఆద్యంతమూ కవిత్వ ప్రాస్వలిపికి కాణాచి. భావకుడైన సహృదయుడు పరిశీలనగా ఈ కవితను చదివితే ఆనంద జీవన మధూళిలో స్నాతుడౌతాడు.

చెరుకువిల్లు అనేది మన్మథ ప్రతీకమైన కవిసమయంగా అనుస్యూతంగా మనవాసనాభాండారంలో సంసిద్ధమైనదే! అంటే మన అంతరంగాలలో సుషమాశృంగారాని కిది ప్రతీకగా మెరుస్తున్న పదచిత్రమే. కాని దీని నీకవి మన్మథాయుధంగా చిత్రించదలచలేదు. మనసులో చైతన్య జ్వాలగా మెదిలే కవితా మహేంద్ర చాపానికి ప్రతీకగా ప్రయుక్తం చేశాడు.

'అక్షరాల ఇసుకతో కవిత కడతారా మరి'

అనే ప్రశ్నగాని ప్రశ్నతో ఈ కవితా ఇక్షుఖండం ప్రారంభమవుతుంది. ఈ ప్రారంభంతోనే ఒక అఖండ జాజ్వల్యమాన

తను స్ఫురింప చేస్తుంది. తడి ఇసుకతో పిచ్చుక గూళ్ళు కట్టే వాళ్ళు అమాయకులూ నిర్మల హృదయులూ అగు పసిపిల్లలు. ఈ నైర్మల్యమూ ఆర్ద్రతా, సునిశిత్వమూ కవులకు కూడా హార్దిక నైజలక్షణమే. పసివాళ్ళు నిర్మించే పిచ్చుక గూళ్ళలో ఆ రాత్రి చీకటిలో పిచ్చుకలు వచ్చి కాపురం చేస్తాయన్న భ్రమ (Illusion) వారికి ఉత్సాహమిస్తుంది. అలాగే కవి, జీవన సంఘర్షణలో నిర్మించే కవితలలో జాతి హృదయం సుఖావాసం చేస్తుందని భ్రమిస్తాడు. భ్రమ నిర్మాణోత్సాహాన్ని కలిగించ డంలో ఇక్కడ సాదృశత ఘటింపబడింది.

అయితే పసివాళ్లుకట్టే పిచ్చుక గూళ్లకు తడిఇసుక ఒక్కటే చాలు. కవులకు అక్షరాల ఇసుక ఒకటే సరిపోదు. 'తలపుల నెత్తావులు చిమ్మే మృదుహృదయ సుమధూళి కావాలి. కవితకు తలపులతోనే పని. కాని తలపులే కవితలు కాలేవు. నెత్తావులు చిమ్మే మృదుహృదయ సుమధూళి వాటి ఒడళ్ళ నిండా హత్తుకోవాలి. తలపులే కవిత్వమయితే, అవి మానవులందరికీ ఉంటాయి. కాని కవి మనస్సులోని తలపులు చిత్రాలుగా నెత్తావులు చిమ్మాలి. అవి మృదుహృదయ స్ఫోరకాలు కావాలి. మానవులందరికీ మధురమైన స్వప్నాలు హృదయాలను మెరిపిస్తాయి. కవీ మానవుడే కనక అతనకి వర్ణచిత్రాల వంటి కలలు వస్తాయి కాని ఎంత మనోహర స్వప్నమైనా కళాఖండం కాలేదు. సామాజికులకు పరిచితమైన సామగ్రి ద్వారా అవి బట్వాడా అయినపుడు మాత్రమే కళాస్వరూపం ధరిస్తాయి. పైగా కవి

ఎన్నుకోవలసినవి సామాన్యమైన నేల బారు తలపులు కావు. అయితే అవి ఎలా వుండాలని కవి వాంఛిస్తాడు? రాబర్ట్ ఫ్రాస్ట్ కవి ఈ ప్రశ్నకు చక్కని సమాధాన మిచ్చాడు: 'Saying one thing and meaning another, Saying one thing in terms of another' అలాంటి ధ్వనిపూరకమైన మృదుహృదయ సుమ ధూళిని కవి ప్రయోగించాలి. అంటే జీవన వాస్తవికతలను భాషా పరమైన మనోరంజకత్వంలో రంగరించి ఆర్ద్రిమొనరించాలి. అపుడు కవిత శ్రోతృ హృదయంలో చెరుకువిల్లుగా రసాలూరి స్తుంది. హరి విల్లుగా మెరిసిపోతుంది. ఇది ఈ కవి ఈ పదచిత్రం ద్వారా సాధించినధ్వని.

కవికి అక్షరాలు తప్ప అభివ్యక్తి సాధనాలకు మరో గత్యంతరం లేదు. ఈ అక్షరాలు తరతరాలుగా సమాజం రూపొందించు కుంటూన్న అనుసూత్య మానవ భాషకు వాహ కాలు. అలాంటి భాష తప్ప కవి వ్యంజనకు, అభివ్యక్తికీ అన్యథా శరణ్యం లేదు. అయితే ఇక్కడ ఒక సూక్ష్మం ఉంది. సామా జికు లందరూ ఉపయోగించుకునే భాషనే కవి స్వీకరిస్తాడు. కాని అందరి రోజువారీ వాడకానికీ అతీతమైన ఫక్కీలో ఆ భాషను పునరుజ్వలింప చేస్తాడు. మామూలు పదాలకు నూత్న శక్తిని ఆరోపింప(Recreate) చేస్తాడు. ఈ అవగాహనను—నెత్తావులు, మృదుహృదయ సుమధూళి, జీవన మధూళి వంటి పదచిత్రాల సమ్మేళనం ద్వారా ఈ కవి సాధించాడు.

ఇలాంటి సందర్భంలోనే, కవి ప్రయోగించే భాషా విశిష్ట తను గురించి ఫ్రెంచి మహాకవి మల్లార్మే ఇలా అంటున్నాడు: 'To Purfiy the dialect of the tribe' ఈ శాసనము అనే పదం ద్వారా చక్కగా సందేహానికి తావులేకుండా వక్కాణిం చారు. ప్రజల దైనందిన భాషను తన నిశిత బుద్ధితో శాశనం చేసి వాడుకో గలిగే ప్రజ్ఞకల వాడే ఉత్తమ కవితను అందిస్తాడు. దీనినే ఈ కవి ఇలా ధ్వనిస్తున్నాడు. "చెరుకు విల్లు విరచిననాడే చిగురుకైత చెపుతాడు"—అని. ఈ చెరుకు విల్లు విరవడం అనే పదచిత్రంలో రెండు మనోహర భావచిత్రాలు (Ideograms) భాసిస్తున్నాయి. మన్మథుడు చెరుకువిల్లుకు సుమ బాణాలు లగిస్తాడే తప్ప విరవడు. కనక ఇక్కడ అనంగ ప్రసక్తి లేనేలేదు. అయితే శివధనుర్భంగం చేసిన శ్రీరాముడే మైథిలీ కరగ్రహ ణానికి అర్హుడయ్యాడు. కాని శివధనువు చెరుకు విల్లు కాదు. అయితే ఈ రెండు రూపారోపణల మిశ్రమం ద్వారా చిగురు కైతను సంధించకలిగే శక్తి ఎట్టిదో ధ్వనింప బడింది. చెరుకుకు సారం పర్వణి —కనుక అది విరిచి కణుపు కణుపుకీ గల రసాన్ని చిప్పిల చేయగలుగు తాడని రెండోధ్వని. ఇంత దూరార్థ సమన్వితమైన మనోహర పదచిత్రాన్ని ఏకదేశంగా కవి ప్రయుక్తం చేయడంలోనే సిద్ధి ద్యోతకమవుతుంది.

ఈ భావాలన్నీ ఎలా ఉద్భూతమయ్యాయి? కవి గురి చూసి కల్పించినవేనా, లేక సహృదయుడైన వ్యాఖ్యాత అతి వేల సానుభూతితో స్వకపోల కల్పితంగా overtone చేసి ఆపా దిస్తున్నాడా?

ఉత్తమ కవితా వాక్యంలో పదాలకుండే సామాన్య అర్థాలకన్న అతీతార్థాలు ద్యోతకమవడం సహజమేనని ముందు చెప్పుకున్నాం. ఆ అతీతార్థాలను పట్టుకోగలిగే సహృదయులకు ఇంత భావనా పురివిప్పుతుంది. ఈ సందర్భాన్నే ఈ యుగపు ఆంగ్లమహాకవి ఆడెన్ ఇలా వివరిస్తాడు.– 'The Poet is the father who begets the poem which the language bears' అంటే సామాన్యభాష కే కవితా బీజశక్తిని ఆరోపించి మనోహర భావగర్భితంగా మారుస్తాడని ఆయన ఉద్ఘాటించాడు. ఆ విధంగానే ఈ కవి వాడిన పదాలకు రమ్యభావగర్భితాపాదన జరిగింది.

'చెరుకు విల్లు విరిచిన వాడే చిగురుకైత చెపుతాడు
ఎదల పొదరిళ్ళ మీద మల్లెలు విరియిస్తాడు.'

ఇక్కడే శుష్కతార్కికుల మనస్సు గంద్రగోళమై పోతుంది. ఎందుచేతనంటే ఈ వాక్యాలలో చర్మచక్షువులకు గోచరించే అంతస్సూత్రం ఏదీలేదు. కావాలని భావం నుంచి భావానికి చేసిన ఉత్తుంగ లంఘనం కనిపిస్తుంది. శుష్కతార్కికులు–చెరుకు విరవడానికీ, చిగురుకైత చెప్పడానికీ ఏమిటి సంబంధమనీ, ఎద పొదరిళ్ళమీద మల్లెలు విరియించడం ఎలా సాధ్యమనీ, కనక absurd అని తోసి పారేస్తారు. కాని పాపం తానెంత ప్రమాదంలో పడిపోయాడో గ్రహించలేడు.

ఈ రెండు పాదాలలోనూ గల పదచిత్రాలను చక్కగా సమన్వయించే అంతస్సూత్రం ఉంది. దాన్ని కవితాహృదయు

సమ భావుకతగల సహృదయుడు సునాయాసంగా అందు కుంటాడు.

చెరుకు విల్లును విరిచినవాడు చిగురుబోడిని అందుకున్న రీతిగా చిగురు కైతను ఎలా అందుకోగలడో ముందే వివరించడం జరిగింది. అలా అందుకోగలిగినవాడు దైనిక జీవితపు బాదర బందీల శిశిరాఘాతాలకు లోనయ్యే సామాజికుల హృదయాలకు మధూత్సవాన్ని ఘటించగలుగుతాడు. కవి చెప్పే చిగురు కైతతో మోడుబెదలు పల్లవిస్తాయి. ఎదల పొదరిళ్లమీద మల్లెలు విరుస్తాయి. మల్లెలు మధుమాస సంకేతాలు. అలా విరి యించగలిగినవాడు తలపుల నెత్తావులు చిమ్మే మృదుహృదయ సుమఘాళిని సాధించినవాడు కాక అన్యుడెలా కాగలడు?

సాధారణంగా కవులు ప్రయుక్తంచేసే పదచిత్రాలలో రెండు ప్రధాన విభేదా లుంటాయి: భౌతిక స్వరూపాలలోని సామ్యధర్మాలను మాత్రమే వ్యక్తం చేసేవి మొదటి రకం. ఇలాంటి వాటిని సగుణ పదచిత్రాలు (Concrete images) అన వచ్చు. అంటే—అక్షరాల ఇసుకా, చెరుకు విల్లు విరవడం, పొద రిళ్ళమీద మల్లెలు వంటివి. ఇవి మన బాహ్యేంద్రియాలకు సుపరి చితాలైనవి. మన గ్రహణ శక్తికి చప్పున అందుతాయి. సద్యః స్ఫూర్తిగా మన అనుభూతులను మేల్కొలుపుతాయి. రెండో రకం పదచిత్రా లున్నాయే-అవి కేవలం నిర్గుణ పద చిత్రాలు (Abstract images). అంటే గుణ రహితాలని అర్థం కాదు.

సగుణోపాసన నిర్గుణోపాసన అని మన తాత్త్వికులు వింగడించిన ప్రయోగార్థాన్నే యథాతథంగా మన మిక్కడ స్వీకరించాలి. ఈ పదచిత్రాల సూక్ష్మాకృతులు అమూర్తమై కేవలం అంతశ్చక్షువులకు మాత్రమే గోచరాలై మన అనుభూతులనూ (feelings), మన రసభావాలనూ (Sentiments) జాగృతం చేస్తాయి. ఇంద్రియ జన్యమై, వాసనావాసితమై, అంతశ్చైతన్యంలో సుప్తమై ఉండే మానసికానుభూతులను చల్లగా స్పర్శించి మేలుకొల్పుతాయన్నమాట. బాహ్యావాస్తవిక అనుభవాలు మరిగి ఆవిరియై, తిరిగి ద్రవబిందు రూపంగా మనోపటలాన్ని ఆర్ద్రం చేయగలవని అర్థం చేసుకోవాలి. ఇలాంటి నిర్గుణ పదచిత్రాలకు తలపుల నెత్తావులూ మృదుహృదయ సుమధూళీ జీవన మధూళీ వంటి వాటిని ఉదాహరణంగా చెప్పుకోవచ్చు.

ఉత్తమ కవితలో పై రెండు లక్షణాలూ అవిభాజ్యంగా పెనగిపోతాయి. ఆనందానుభూతిని స్థాపిస్తాయి. అన్నమయ కోశంలో మట్టిదివ్వెలు పెట్టుకొని ఆనందమయ కోశంలో కాంతులు ప్రసరిస్తాయి. ఈ సగుణ నిర్గుణ పదచిత్రాల సమ్మేళనం ద్వారా ఆనందానుభూతి ఎలా సాధ్యమవుతుంది ?–అనే ప్రశ్నకు కవి పరంగా కాక, పఠిత హృదయ మాధ్యమికంగా పరిశీలించి సమాధానం చెప్పుకోవాలి.

సృష్టి మనిషిని మనోజీవిగా రూపొందించింది అంటే అతని హావభావాదులు రసభావాలు కామేషణలు అన్నీ మనో

జన్యాలే. కేవల భౌతిక పరిస్థితుల ఆవరణలో మాత్రమే పరిధ విల్లేవి కావు. అంటే భౌతికావసరాలకు, ఎదురుపడే వస్తు సము దాయం కలిగించే లాలసకూ ఎంత సంబంధం ఉంటుందో-మనో జన్యమైన వాంఛావాగురకూ, ఆశించే భౌతిక వస్తు సముదాయం పట్ల ఆకర్షణకూ సైతం అంతే సంబంధం ఉంటుంది.

ఇక్కడ అందరికీ తెలిసిన ఒక సామాన్య ఉదాహరణను వివరించుకోవడం అవగాహనాపుష్టికి దోహదం చేస్తుంది: ఎండలో నడచివచ్చి దప్పిగొన్న వ్యక్తికి పచ్చని నిమ్మపండు కనిపించి దాని పరిమళం ముక్కుకు తగలగానే ఆ వ్యక్తి వెంటనే ఆకృష్టుడవుతాడు. ఆతనికి నోరూరుతుంది ఇది ఎంత సహా జమో ఆ వ్యక్తికి నిమ్మపండు గురించిన గుణగణ వర్ణన విని పించినపుడు సైతం ఇదే బాహ్యప్రకోపం కలగడంకూడా అంతే సహజం. అయితే ఆ వ్యక్తి వాసనా భండారానికి నిమ్మ పండు రంగూ రుచీ పరిమళాదులు పరిచితపూర్వాలు కావాలన్నది మనం వేరే నిర్ధారణ చేసుకోనక్కర లేదు. అలాగే రత్యాదు లన్నిటిపట్లా ఉన్ముఖమవడమూ మనం అన్వయించుకోవచ్చు.

అందుకే కవిత ప్రధానంగా తన రంగభూమిని బాహ్యేం ద్రియానుభూతికే పరిమితం చేయదు. తదతీతమైన మనోరంజ కత్వాన్ని ఆధారభూమిగా గ్రహిస్తుంది. కనుకనే ఒక విమర్శ కుడు ఇలా అంటాడు : "To urge the mind to human insight is the final aim of the poet; but it is his

speech which produces that result"- అన్న వాక్యం వివరించుకోనక్కర లేకుండానే గ్రాహ్యం కాగల సత్యం.

వలపు వలలో రంగులచేపగా చిక్కనివాడు
జనన మరణ కూలాలొరిసి పారే
జీవన కల్లోలినిలో జలక మాడనివాడు
కలల కల్హారమాల మెడలో దాల్చనివాడు
కవిత కడగంటి చూపుల కలిమికి నోచుకోలేడు.

ఇది ఒక సుమనోహర చిత్రణ జీవితం అంటే ఇటు జననమూ కాదు, అటు మరణమూ కాదు, కొందరసమగ్రదర్శనులు జీవితమంటే జనన మనుకొని జననానికి పూర్వరంగమైన శృంగారాన్ని వేనోళ్ళ వర్ణించడమే కవితాధ్యేయమనుకుంటారు. క్రిమికీటకాదుల కన్నా పశుపక్ష్యాదుల కన్నా మనిషి చేతగాని వాడనీ, అనాగరికుడనీ భావించి లైంగికశాస్త్ర వివరణ మన్న మిషతో పాఠకులలో త్వగింద్రియ ప్రేరణలు కలిగించడమే వృత్తిగా పెట్టుకొని కుటుంభరు లవుతున్నారు. మరి కొందరు మరణానంతరం సంభవిస్తుం దనుకొనే ఆత్మపరమైన ఆముష్మిక భ్రమల ఆసరాతో కవిత్వాది కళల్ని దుర్వినియోగం చేస్తున్నారు.

సమగ్ర హేత్వధీనమైన ఆధునిక చేతన ఈ రెంటినీ బేషరతుగా తిరస్కరిస్తుంది. జనన మరణాలనే రెండు కూలాలను ఒరిసి చైతన్యవంతంగా పారే కల్లోలినియే జీవితమని గ్రహి

స్తుంది. ఇక్కడ ఈ కవి కల్లోలిని అనే పదాన్ని ప్రయోగించ డంలో ఒక చమత్కార భాసురత్వముంది. కల్లోలంతో కూడిన ప్రవాహం కల్లోలిని, ఒక తొందర, ఒక అలజడి, ఒక హోరు, ఒక అశాంతి, ఒక అస్థిమితమూ, ఒక అసంతృప్తి—ఇవన్నీకల్లో లిని లక్షణాలు. జీవితానికీ ఇవన్నీ సమాన ధర్మాలే. ఇలాంటి పద ప్రయోగాలలోనే ఎవడు ఉత్తమ కవో చటుక్కున తేలి పోతాడు.

ఆంధ్ర భాష ద్రావిడ సంస్కృతభాషల సుందర దాంప త్యంతో అభివృద్ధి చెందింది. రమణీయంగా రూపొందించి, తదు పరి కాలంలో అరబ్బీ, పారసీ ఉర్దూవంటి అనేక భాషాపదాలను కూడా తన వ్యవహారంలో చేర్చుకుంది. మరింత పుష్టిని సంత రించుకుంది.

ఆంధ్రభాషలో ఇంచుమించు ప్రతి పదమూ వ్యుత్ప త్త్యర్థాలపై ఆధారపడిందే. ప్రతి పదానికీ స్వయంవ్యక్తిత్వం నిర్ధారితమైంది. రంగూ రుచీ వాసనా కలిగి ప్రతి పదానికీ విశిష్ట శాబ్దిక సౌందర్యం సిద్ధించింది. కనుకనే మన కవితను ఆంగ్లం లోనికి అనువదించినపుడు కేవలం కవితకు గౌణమైన భావాన్నే భాషాపరివర్తనం చేయగలుగుతున్నాం. అంతేగాని శబ్దమైత్రితో సాధించబడిన శ్రవణ సుభగత్వాన్ని, చతురక్షరసంయోగాన్నీ తర్జుమా చేయలేకపోతున్నాం. అందుకే క్రిష్టఫర్ కాడ్వెల్ ఖచ్చి తంగా ఒక మాట చెప్పాడు. ఏ భాషాకవిత్వమయినా అను

వాదానికి లొంగేది కాదని దానికి ప్రధాన కారణం కవిత్వం సార్వత్రికంగా పదాల పోహళింపుద్వారా ఏర్పడిన సౌందర్యాన్ని పుణికి పుచ్చుకుంటుందని.

ఆధునిక ప్రపంచభాషలలో ఆంగ్లభాషకు అపారమైన అభివ్యక్తి సౌందర్యముంది. ప్రపంచభాష లన్నిటినుంచీ అవసరమైన పదాలను నిరభ్యంతరంగా స్వీకరించి హాయిగా ఆ భాష సంపన్నమయ మైంది. కాని ఆంగ్ల కవులు చెట్టును ఇతివృత్తంగా స్వీకరించి కవిత రాయదల్చుకుంటే ఎన్నిసార్లు చెట్టు అనే పదాన్ని వాడవలసి వచ్చినా Tree అనే నిస్సంకోచంగా ప్రయోగించి సౌందర్యాన్ని సాధిస్తారు. కాని తెలుగుకవికి అలా సంతృప్తి పొందలేని వారసత్వం ఒకటుంది. సందర్భానుసారంగా పదమైత్రికి అవసరమైన రీతికి అనుగుణంగా పాదపమనీ, భూజమనీ ఇత్యాది పర్యాయ పదా లెన్నో వాడుకుంటూ పోతాడు. ఇది ఈ భాష సాధించిన విశిష్టమైన సుందర సంప్రదాయమే తప్ప తిరస్కరణీయం కాదు. కనుకనే ఇక్కడ కల్లోలిని అన్న పద ప్రయోగం విశిష్టార్థ ద్యోతకంగా తనరారింది.

కలల కల్హారమాల ధరించనివాడుకూడా కవిత కడగంటి చూపులకు నోచుకోలేదు. అయితే ప్రతివాడినీ తడవ తడవకీ కలలు అలరిస్తూనే ఉంటాయి. కవి కనే కలలు అలాంటివి కావు. అవి కల్హారమాలలు. మృదుల మసృణాలు, శీతల సుకుమారాలు అట్టి కలలను మాలగుచ్చి కవిగళం ధరించాలి. అప్పుడే ఆ

శృంగార అలంకరణతోనే, పెళ్ళికొడుకులా సంసిద్ధమయి ఉన్నప్పుడే కవిత తన కంటి కొనమెరుపులు ప్రసరిస్తుంది. ప్రసన్నురాలవుతుంది. అతన్ని వరిస్తుంది. కలలజోలికి పోని వితండవాది— సంప్రదాయమో అర్థ ధర్మ ప్రచారమో, రాజకీయ సిద్ధాంత శుష్క నినాదమో, వెలువరిచే కవిమ్మన్యుడికి కవిత తన పయ్యెద గాలికూడా తగలనివ్వదు. పైగా అలాంటివాడు కనే కలలు నీచమై నేలబారుగా ప్రాకుతాయి. బ్రతుకు దుర్గంధాలను పులుముకుంటాయి. నిత్య జీవితావరణలో గుడిసుళ్ళు తిరుగుతాయి. కఠోర వాస్తవికతలను మాత్రమే కవిత్వవిదూరంగా ఏకరువు పెడతాయి.

ఫ్రెంచి మహాకవి పోల్ వేలరీ చెప్పినట్లుగా వ్యక్త హృదయ చైతన్యంతో నిరంతర జాగరూకుడైన భావుకుడుకనే కలలే కవితలు ! ("It is the very one who wants to write down his dreams who is obliged to be extremely wide awake") అలాంటి కలల కల్హారమాల గళంలో ధరించాలి కవి. అంతేకాదు. ప్రపంచ విపంచి తీగల రాగాలకు కన్నీరొలకనివాడు కూడా కవిత కడగంటి చూపులకు నోచుకోడు. ప్రపంచ విపంచితీగలు నిత్యం రాగాలొలుకుతాయి. ఆ రాగాలు బహిరింద్రియానికి మాత్రం వినిపించేవి కావు చెవిలోపలి చెవికి వినిపిస్తాయి. అట్టివాని భావ ప్రకంపనాలు నిజమైన కవికి కన్నీరొలికిస్తాయి. స్వాత్మక దుఃఖాలనో, ఆత్మాశ్రయ ఆక్రోశాలనో, స్వీయ వ్యక్తిగత నష్టాలకు సంబంధించిన శోకా

లనో ముందుంచుకొని దురపిల్లే సామాన్యునకు ఆ రాగాలు అందవు ప్రపంచశోకార్తిని పరాత్మకంగా దర్శించి స్వాయత్తం చేసుకోగలిగేవాడు కవి, ఈ పరకాయ ప్రవేశంవల్ల అతనికి లభించేది కన్నీరు మాత్రమే కావచ్చు కాని ఆ కన్నీటనే కవితాకల్హారాలు విరుస్తాయి. ఈ వాక్యం ద్వారా ఈ కవి ఆశిస్తున్నది కవికి పరాత్మక పరిశీలన అవసరమని; అంటే కవి ద్రష్ట కావాలని; తద్వారా లోకవృత్త ప్రదర్శనము కవితకు శరీరం వంటిదవుతుందని ధ్వనిస్తున్నారు.

కవి ఎవో అక్షరాలతో కాగితాలు నింపడం ద్వారా శతాధిక గ్రంథకర్త ననిపించుకోవాలని ఉబలాట పడటం అతని కృషికి నిష్కృతి కలిగించదు ప్రతి సంవత్సరం పితృ దేవతలకు ఆబ్దికాలు పెట్టినట్లు తప్పనిసరిగా కవితా గ్రంథం ప్రచురించాలని నియమం పెట్టుకోవడంవల్ల కూడా కృతార్థత లభించదు. అలా ప్రకటితమైన గ్రంథాలన్నీ కవితలే అనుకోవలసిన పూచీ రసజ్ఞుడికి లేదు. ఒకడి జీవితంలో కవితానుభూతి పుష్కలమై పెంపెసలారి నప్పుడే అది కాగితాలమీద పడుతుంది. అందుకే ఈ కవి ఇలా అంటాడు.

జీవితంలో లేని కవిత కాగితాలమీద కొస్తుందా ?

తునక మబ్బు లేకుండా చినుకు నేల పడుతుందా?

ఈ ప్రశ్నతో ఒక సత్యాన్ని ఆవిష్కరిస్తున్నాడు. కవితా రచనకు పుష్కలావర్తమైన రసహృదయముండాలే తప్ప-కాగితాలూ

కలమూ హస్తమూ మాత్రమే కాదు. ఒక్క మబ్బుతునకైనా లేకుండా వాన కురుస్తుం దనుకోవడం ఎంత భ్రమో ఇదీ అంతే. దీనినే కవి ఇంకా ఇలా వివరిస్తున్నాడు :

'సుందర మానవ జగత్తు సృష్టించనివాడు
ముసలి పదాలతో మురిపేలాడుతూ సరిపుచ్చుతాడు
ఊహకు రెక్కలున్నవాడు ఉదధులు దాటుతాడు
ఉత్తుంగ శిఖరాల కెగురుతాడు

ఇదీ కవి చెప్పదల్చుకున్న మౌలికాంశం. కవికి సుందర భావ జగత్తు అంతర వీక్షణానికి దర్శనమివ్వాలి. దానిని అతడు స్పష్టంగా అభివ్యక్తం చేయగలగాలి. అదీ శక్తి. అది లేనివాడికి కవితాహృదయపునర్నవత్వం లభించదు ముసలి పదాలతో మురిపాలాడుతూ కాలక్షేపం చేస్తాడు. సంప్రదాయాన్ని రక్షిస్తున్నా ననుకుంటూ మురిసిపోతాడు. అలాంటి సంప్రదాయభీరువుకి తిలక్ చెప్పినట్లు నవ వసంతం రాదు. కవి ఊహకు రెక్కలుండాలి. అప్పుడే అతని మనో విహంగం ఉదధులు దాటుతుంది ఉత్తుంగ శిఖరాల కెగురుతుంది లేనివాడి బ్రతుకు నేల బారుగా నడుస్తుంది. మురికికాలువలో పొర్లాడుతుంది. బూడిదా బుగ్గీ పట్టించుకొని వీరశైవం ప్రదర్శిస్తుంది. ఈ పైన తెలిపిన ప్రాథమిక లక్షణాలున్న- "వాడే చైతన్యుడు. వాడే చరిత్ర సృష్టిస్తాడు. చరిత్ర భారాన్ని జ్ఞాననేత్ర జ్వాలాదగ్ధం చేస్తాడు." ఇక్కడ చరిత్ర అనే ఒకే మాట రెండు స్థాయీ భేదాలలో ప్రయుక్త మయింది. మొదటిది కవి సృష్టించవలసిన నూత్న

చరిత్ర. రెండవది గత మానవ చరిత్ర. దానినిండా ఆక్రోశాల పిచ్చిడొంక లెన్నో ఉన్నాయి. శోకసాగరాల భారాలు ముంచె త్తాయి. వాటి నన్నిటినీ తన జ్ఞాన నేత్రాగ్ని జ్వాలలతో దగ్ధ పటలం చేస్తాడు కవి.

ఈ కవిత ఈ వాక్యంతో ఒక పరాకాష్ఠకు చేరింది. సహజ మైన ముగింపును సంతరించుకుంది. నిజానికి ఈ వాక్యంతో నే ఈ కవి దీన్ని ముగించిఉంటె అత్యంత రమణీయంగా ఉండేది. చిరంతన దీప్తిని వెలార్చేది. కాని తరవాత సంయమనం కోల్పోయి ఏడు పాదాలు ఊడిపడ్డాయి. వాటితో కవితకుతిరిగి Anticlimax చేకూరింది. ఆ ఏడు పాదాలలోనూ ఒక పట్టిక చేర్చబడింది. ఈ పట్టిక ఉత్తమ కవితా భావ భంజకంగా తయా రయింది.

ఈ "పక్షులు" అనే కవితా సంపుటిలో జాబిల్లి అనే మరో కవిత మనోహరమైనది. కొత్త చిగుళ్ళు, విశ్వఘోష, అని వార్యం, తొలిచూపు, ప్రపంచ మానవులు, సన్నజాజి—అనే ఆధువిక కవిత లున్నాయి. ఇవి కవితా గుణభాసురాలే కాని (Common Place Poems) చాలా సామాన్యాలు.

ఈ సంపుటిలో మిగిలినవన్నీ పద్యాలు. పక్షులు, వలపు. కవిత, జ్వాల, రాగమయి. జీవనఖేల, నిరీక్ష, ఆత్మజ్యోతి, నవ మల్లిక, అశ్రువు, వియోగి, జీవనగంగ, ఒక గంధర్వుడు, మృత్యుంజయులూ, ఒక మైత్రి, నేను, సంక్రాంతి—వంటి శీర్షి కలన్నీ పద్యరచనా నిష్ణాతృత్వాన్ని వేనోళ్ళ చాటుతున్నాయి.

నేటి కాలంలో పద్యాల ముసలిగుర్రాలపై స్వారీచేసే అసంఖ్యాక కవి ప్రకాండులు గణతంత్రులై పాదపూరణ చేస్తున్నా రేతప్ప భావ పిచ్ఛలితం చేయడంలేదు. అలాంటి దురదృష్ట వంతులంతా శేషేంద్ర పద్యాలను అధ్యయనం చేసి భావా విష్కారానికి పాత పద్యాన్ని ఎలా మలుచుకోవాలో గ్రహించ గలిగితే బాగుండును!

అయినా పద్యం నిన్నటి కవితా వాహకం. నేటి తొందర తొందర ప్రయాణానికి ఎద్దులబండి పనికిరాదు. గజారోహణమూ వలను పడదు ఆటోమేషన్ మన జీవితాలకు విపరీత వేగం సంత రించింది. కార్లూ, రైళ్ళూ సయితం ఆధునిక మానవుని మనో వేగాన్ని మోయలేనివి కాగా అతడు విమానాల్నీ, జెట్స్‌నీ, సమకూర్చుకున్నాడు. పద్యాలు మాత్రమే అనవద్య సాధనా లనుకోవడానికి ఈ యుగం అంగీకరించదు. ఈ అవగాహనతోనే శేషేంద్ర శేషజ్యోత్స్ననీ, మండే సూర్యుడినీ నూటికి నూరు పాళ్ళూ ఆధునిక కవితా సౌరభాలతో వెలార్చాడు. కనుకనే అస్మదాదుల సహృదయ హృదయాభినివేశాన్ని, పుష్కలంగా చూరగొంటున్నాడు. ఈ వ్యాస పరిధికి పద్యకవితలు పరిశీల నాంశంగా స్వీకరింపబడక పోవడానికి అదే కారణం.

——

మూడవ ప్రకరణము :

# నేటి అకవిత్వ దుర్వాయువులు

నేడు సర్వత్రా అకవిత్వ దుర్వాయువులు వ్యాపిస్తున్నాయి. కవిత్వ స్వరూపంపైనే సర్వులూ దృష్టిని కేంద్రీకరిస్తున్నారు తప్ప, కవిత్వ స్వభావం గురించి అధికసంఖ్యాకులు ధ్యానం చేయడం లేదు. బహుశా ఉజ్వలమైన కవిత్వం పరిఢవిల్లుతున్న కాలంలోనే అల్ప ప్రతిభలు కవితాకర్షణకు లోనైనంత అవిరళంగా కవితాసాధనకు పూనుకోలేక ఉత్తమ కవితలకు దిష్టిబొమ్మలు సృష్టించడం కూడా సహజలక్షణమేనేమో! ఇలాంటి అల్ప ప్రతిభులు ప్రతికాలంలోనూ ఉంటారు. పూర్వకాలాంలోనూ ఉంటారు. పూర్వకాలాలలో ఏరాజునో ఏదండనాధిపతినో ఆశ్రయించి మెచ్చికోలు కబుర్లు చెపుతూ బ్రతికేవారు. వర్తమాన కాలంలో రాజుల స్థానంలో రాజకీయపార్టీలు, నాయకులూ, ప్రభుత్వ అధికారులూ ఏలుబడి సాగిస్తున్నారు. వీళ్ళ ప్రాపకంతోనే ప్రాబల్యంతోనే అల్పప్రతిభులు తాము రాసిన దానినే ఉత్తమ కవితగా ప్రచారంచేసుకో గలుగుతున్నారు.

కవితకు ప్రధాన జీవలక్షణం ప్రతిభ. ఈ ప్రతిభే ప్రారంభ యౌవనంలో కవిత పట్లనో ఇతర కళా స్వరూపాల పట్లనో ఒకడి

హృదయానికి ఆకర్షణ కలిగిస్తుంది. అయితే ఈ ప్రతిభ సర్వదా ఒకే స్థాయిలో ఉండదు. ప్రతిభావంతులలో ఋణధ్రువం వైపుగా అల్పప్రతిభులూ క్షీణప్రతిభులూ ఉన్నట్లే ధనధ్రువం వైపుగా అతిప్రతిభులూ మహాప్రతిభులూ ఉంటారు. ప్రతిభ అనేది బీజ ప్రాయంగా ఉంటే దానిని అక్షీణమననధ్యానాదులతో పెంపొందించుకోవచ్చు.వ్యుత్పన్నతను దానికి అధిష్టానంగా(Base) చేసుకుని కాపాడుకోవచ్చు. అంతే తప్ప వృత్తికోసం పాండిత్య పట్టా పుచ్చుకున్నంత మాత్రంలో ప్రతివాడికీ ప్రతిభ దానంతట అదిగా లభించదు. కనుకనే ప్రతియుగంలోనూ కవులూ పండితులూ అనే రెండు వర్గాలు వేర్వడవలసి వచ్చింది. ఇలాంటి పండితుల్ని చూసే శ్రీనాథమహాకవి 'బూడిద బుంగవై' అనే పద్యంలో తిరస్కరించాడు. ప్రతి గాడిదా కవిగా చెలామణీ అయిపోతోందని బాధపడ్డాడు.

ఈ లక్షణం మరీ అంత బాధపడవలసింది కాదు. గొప్ప కాంతి ఉన్నప్పుడే చిక్కని నీడలు కూడా ఉండడం సహజం. కవిత్వాకర్షణకు లోనైన అప్రతిభులూ, అల్పప్రతిభులూ ఏవో దిష్టిబొమ్మల్ని నిర్మించినంత మాత్రంలో ఆయుగ ఉత్తమ కవితా ప్రతినిధులుగా అవి నిలబడగలిగే ప్రమాదం ఎప్పుడూ ఉండదు. నిజానికి ప్రతివాడూ కవికావలసిందే. అంటే అచ్చమైన కవితా హృదయాన్ని పెంపొందించుకోవలసిందే. తద్వారా లభించిన రసజ్ఞతతో కవితాధ్యయనంలో కేంద్రీకరించవలసిందే. తన హృదయానికి మరిన్ని వెలుతురు రేకులు హత్తుకోవలసిందే. తన

గుచ్చుకోవడంలా ఉందిట. ఈ వాక్యంలో ఇంత మనోహర భావాన్ని అభివ్యక్తం చేసిన పదాలు మూడే మూడు: rough, male kiss, blanket. ఇంతే...దీనితో తరంగితమైన ఆలోచనా ధార ఎంత దూరమైనా ప్రవహిస్తుంది. అలాగనే శ్రీ శేషేంద్ర, "పక్షుల గొంతుల్లో పాటను పుచ్చుకొని పారిపోయింది రాత్రి" అని అన్నా "ఆశలూ రక్తబిందువులు కలిపి, అల్లిన దండ వేసుకొస్తున్నాడు" అనినా, "సముద్రాలలో సముదగ్ర కెరటాలు లేపాడు; కొండలు దిండ్లుగా విశ్రమించాడు; ఉషస్సు వాడి ముఖంమీది చెమట బిందువుల్ని రక్తపు మరకల్ని తుడుస్తోంది" అని అనినా అల్పమైన పదచిత్రాలలో అనల్పమైన భావకాంతిని సాంద్రతరం చేయడమే కనిపిస్తోంది.

కనుకనే కవితలో ప్రతి పదమూ అతి జాగరూకతతో మధింపబడి ప్రయుక్తం కావాలి. ఆ పదానికి ఆ స్థానంలో అనివార్యమైన స్థిరత్వం ఏర్పడాలి. ఉజ్వలశక్తి, అనవద్య రక్తి లభించాలి. అప్పుడే ప్రతి కవితా మననయోగ్య మవుతుంది. పాఠకుని మనోపటలంపై పదికాలాలపాటు మనగలిగే పదాల నద్దుతుంది.

Emily Dickinson అనే అద్భుత కవయిత్రి జీవితమంతా అతి లఘు కవితలనే రచించింది. కానీ అవే అతివేల రామణీయకత్వానికి కాణాచులయ్యాయి. ఆమెకు శాశ్వతకీర్తిని ప్రసాదించాయి. ఆమె బ్రతికిఉండగా ఒక్క కవితనయినా ఒక్క

అకవిత్వం కోకొల్లలుగా పోగులు పడింది. అకవిత్వమన్నా అందులోనూ కొంత కవిత్వముందనిపించి ఫరవాలేదనిపిస్తుంది. కవిత్వంగా హృదయ రంజకత్వం కలిగించని దాన్ని అసలు కవిత్వమని ఎలా పిలవడం? మరో పేరేదీ స్థిరపడకనూ అది కూడా కవిత్వ స్వరూపంలో ప్రపంచితమైందికనుకనూ కరుణించి అలా పిలవడమే తప్ప నిజానికి కవిత్వేతర నీచ లక్షణాలు కలది మరేదో అవుతుంది. కాని కవిత్వంమాత్రంకాదు. కవిత్వపు బాహ్యావేషం ధరించినా అది కవిత్వేతరమే.

ఇంతెందుకు? తెలుగుభాషలో అధ్యాపకుడిని అనిపించు కుంటున్న వాడినైనా సరే, రాజకీయ బోధనా శ్రోత్రియత్వం ఎంతబుద్ధి జాడ్య జనితోన్మాదినిగా చేస్తుందో సోదాహరణంగా పరిశీలించుకోగలం. కవితా స్వరూపంలో నిబంధించిన నినాదా లను ప్రచారపు సుడిగుండాలలో పోజార్చి కవిత్వ సంబంధి ఉచ్ఛ నీచాలపట్ల బుద్ధి ప్రసరించకుండా మేఘావగుంఠనమవుతుంది. ఈ అంధత్వంలో వెర్రిపూనకం ప్రాప్తిస్తుంది. వెర్రి పీరులా చిందులు త్రొక్కిస్తుంది. అప్పుడతగాడు ఎంత నిమ్నలోకాలకు జారి పోతాడో ఎవరకీ అంతుపట్టదు. "చూస్తావేం పట్టనట్టు, ప్రజలు పస్తులుంటుంటే" అన్న అరుపు కవిత్వంగా భ్రమిస్తాడు. "డొక్క ఎండ గుక్కెడు గంజికై నూకలిమ్మంటే మక్కిలి రగదన్ని మిన్ను బొక్కలో తోస్తుంటే— అధికారపు యంత్రాంగం యింకా కొనసాగాలా"? అంటూ ముదనష్టపు గావుకేకలు పెడ తారు. అంతతో కసి తీరక ఇంకా ఇంతనీచంగానూ ఆక్రోశిస్తాడు.

"దేవుడు దయ్యం అంటూ మహిమలు మంత్రాలంటూ నామాలు సాములే కాదు బాబాలై కొందరొచ్చి పరిశ్రమల పేరులు చెప్పి. ప్రభుత్వాల నోర్లు కప్పి నల్ల డబ్బు పట్టి దేశమిడుచు ధర్మతేజులరుగో! (ఓహో! శ్లేష వైభవం కాబోలు!) పైళ్లు తారుమారు చేయు శ్రీనివాసులరుగోరా, బంగారపు దేవుళ్ళను మింగే గోవిందులరుగో..."

ఇదంతా ఛందస్సుందరమైన కవితగా పాఠకులను భ్రమింపచెయ్యడానికి తెల్లని కాగితాన్ని ఖరాబుచేస్తూ నిలువుగా ముద్రించడం ఎంత అపచారమో వేరే చెప్పనక్కరలేదు. కవిమాత్రుడకి శుష్కావేశమూ రాజకీయాక్రోశమూ ఉంటే చాలదు. లోకం మారాలన్న తీవ్రాభినివేశాన్ని ఉత్తమ కవితా వస్తువుగా ఆశ్రయించినంత మాత్రంలోనే సరిపోదు. ఉత్తమ కవితాభివ్యక్తి మార్గం తప్పనిసరిగా అవగతం కావాలి. కవితా శిల్పమూ సంవిధాన చాతుర్యమూ అతని అవధారణలో నిలవాలి. రసావేశాన్ని ఆవిష్కరించే రచనాశక్తి అలవడి తీరాలి. ఇవన్నీ లోపిస్తే కవిత్వఛద్మవేషంలో మరేవో మట్టిబొమ్మలు సృష్టింపబడతాయే తప్ప కవితాకాంతి సమీపానికి కూడా అవి రాలేవు. అసలే మన ఆధునిక కవిత్వం సవాలక్ష ప్రతికూలఋతుపవనాల తాకిడితో ఛిన్నాభిన్నమవుతోంది. పైన వివరించినట్లుగా రాజకీయ నినాదాలే కవిత్వంగా భ్రమించే అల్ప ప్రతిభులు విజృంభిస్తున్నారు. వేరొకప్రక్క విశ్వవిద్యాలయాధికారులనదగిన శాస్త్రులు సమకాలీన సాహిత్యమంతా ఆధునిక

సాహిత్యమేనని ఒక భావ సంకీర్ణతను అపాదిస్తున్నారు. వేరొక ప్రక్క 'గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్' అని తలపోసే పృష్ఠదృక్కులు కవిత్వాన్ని సమకాలీన యోచననీ ఎంత వెనక్కి తీసుకుపోగలమా అని సతమతమవుతున్నారు. ప్రాచీన ఆలంకారిక మతాలలోని నిత్యపరిణామశీలతను గుర్తించలేక, ఆలంకారిక చర్చ ఎక్కడ ఆగిపోయిందో అక్కడనుంచి సాధ్యమైనంత వెనక్కి వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తున్నారు. అలా వెనక్కి వెళ్ళగా వెళ్ళగా వేదకాలపు ఆదిమ సమాజాన్ని నైమిశారణ్యాలనూ కలలుగంటున్నారు. మత సంబంధి, గతసంబంధి, భక్తి సంబంధి నినాదాలతో కొందరు సాహిత్యాన్ని నింపుతున్నారు. ఆధునిక సాహిత్యం పరమ నగ్నంగా ఉండాలన్న ఉద్దేశంతో మరి కొందరు బూతుల బుంగలుగా కవితల్ని రూపొందిస్తున్నారు ఈ విధంగా వర్తమాన కవిత్వం సకల సంకీర్ణమై కలగాపులగంగా ఉంది.

పూర్వకాలాలలో కవిత కథను ఆశ్రయించి సాగేది. తద్వారా కేవల కవితాభిరుచిలేని సామాన్యులు సైతం కథ కోసం ఉన్ముఖులై కొంతయినా కవిత్వపు రుచిని తమ రసనలకు అద్దుకునేవారు. నేడు కథనం ప్రధానంగా వచన స్వరూపాల పాల్పడింది. కవిత్వం అచ్చమైన కవిత్వాభివ్యక్తితో తప్ప మరే యితర ఆసరాతోనూ నిలబడవలసిన ఆధారభూమి లేకుండా పోయింది. అందుకే ఎలిజబత్ డ్రూ అనే ప్రఖ్యాత ఆంగ్ల విమర్శ విదుషీమణి ఇలా అంటోంది: 'Poetry has lost its

public entertainment value and its mass appeal, though this is largely because all its old narrative territory has been taken over by prose'.

ఈ యథార్థాన్ని కవితోపాసకులు మనస్ఫూర్తిగా గుర్తించాలి. కవిత్వము అచ్ఛమైన రమణీయ చిత్రకళగా రూపొందించడానికి ఏఏ రంగులూ హొరంగులూ అవసరమో నిత్య ప్రయోగశీలతతో పరిశోధించాలి. వైజ్ఞానికశాస్త్ర పరిశోధనవలెనే కవిత సంవిధాన ప్రయోగం చిరంతన తపోనిష్ఠగా సాగవలసిందే. అమూన వారసత్వంలో నిజమైన కవిత్వపు జిలుగులు ఎక్కడ ఏవిధంగా ఆవిష్కృత మయ్యాయో, ఈకాలంలో మన రుచికి అనుకూలంగా అచ్ఛమైన కవితాభివ్యక్తి ఎలా రూపొందాలో, ఆధునిక కవితావ్యగ్రుడు సమాధిగతుడై ధ్యానించాలి. ఇంతచేస్తే తప్ప స్వచ్ఛకవితాసాక్షాత్కారం కాదు. నాలిక చిగురుకందని మాటలు పేరుస్తూ, చేతికి వచ్చిన రీతిగా ఏదో ఒకటి రాస్తూపోతే కవిత ఆశించే సత్ఫలితాలు రావు. పైగా క్రమంగా ప్రజల అభిరుచిని నీచమార్గాలవైపు మళ్ళించడానికే దారితీస్తుంది. కవి ప్రచలితంచేసే ఉత్తమాశయాలు-ప్రజాహృదయసీమల్ని కాంతివంతం చేయడంపోయి, ప్రజలు వాటికి విముఖులయే ప్రమాద మేర్పడుతుంది. ఈ ప్రమాదం ఇప్పటికే ఘనీభవించడం స్పష్టంగా కనిపిస్తోంది. తెలుగు కవిత్వానికి ఎంతో పుష్టికలిగి స్వర్ణయుగం ఆసన్నమైందని భ్రమిస్తున్నామే కాని చిత్తశుద్ధితో పరిశీలిస్తే నష్ట, భ్రష్టాచారాలు మాత్రమే విపరీత మవుతున్నాయి.

అందుకే ఆధునిక కవితాభావుకుడు టి. ఎస్. ఎలియట్ ఇలా అంటాడు : The poetic heritage from the past is one of the poet's great posessions, which he must preserve, and from which he drawn part of his own being'. ఉత్తమ వారసత్వాన్ని పరిరక్షించుకోడమంటే గుడ్డిగా పాతనంతా అనుకరించడమని అర్థం కాదు. 'నవనవోన్మేష శాలినీ ప్రతిభ' అంటే పాత కథల్ని పాతరీతిలో, కొత్తగా రాయడమనుకుంటూ కొందరు కవి వృషభులు గానుగెద్దులవలె ఆవృత్తాలలో పడి తిరుగుతారు. వారసత్వాన్ని గ్రహించడానికి పూనుకున్న కొందరు ఆధునికులు పాతకు తాకట్టు పడిపోతున్నారు. మరికొందరు ప్రాచీన సాహిత్యంనుంచి మనం గ్రహించవలసిందీ స్వీకరించవలసిందీ ఏమీ లేదన్న మంకుపట్టుతో దానికి దహన సంస్కారం చేయాలని మూర్ఖంగా తిట్టిపోస్తున్నారు. ఈవిధంగా బహు సంకులంగా రూపొందింది సమకాలీన సాహిత్యం.

Henry Vaugham అనే ఆంగ్లకవి అందుకే ఇలా వాపోయాడు :

> O: it's an easy thing to write and sing
> But to write true unfeigned verse
> Is very hard: O god disperse
> These weights and give my spirit leave,
> To act as well as to conceive :'

ఇంతకుముందు ఉదాహృతమైన వాక్యాలవలె ఎలాపడితే అలా రాసేయడం చాలా సులభమే. కాని నిజమైన కవిత్వం

రాయగలగటం దుస్సాధ్యం. కృతకత్వమూ పటాటోపమూ లేని నిర్మల కవితాచిత్రణ తపఃఫలం వంటిది. కనుకనే కవితాభిలాషి-'హే భగవన్ ! ఈ దుర్భర కవితా వేషధారుల శుష్క వాక్యాలనుంచి నా హృదయాన్ని రక్షించు !' అని మొరపెట్టుకోక తప్పడంలేదు.

ఒక కవి తాను దర్శించినంత నిశితంగా తన సర్వేంద్రియ సమాశ్లిష్టమయిన అనుభూతిని ఉత్తమ కవితారీతిలో అభివ్యక్తం చేయడం మాటలతో వచ్చేది కాదు.

ఏ కాలంలోనైనా ఏ అభిప్రాయాలకు వాహకమైనదైనా కవిత్వం కవిత్వంగా బ్రతికి తీరాలి. అప్పుడే అది ఆలోచనామృతమవుతుంది. ఎంత విశాలార్థాలకైనా ఆకరమై ప్రజ్వలిస్తుంది. కవిత్వంలో ఎంత ప్రసాదగుణమున్నా భిన్నభిన్న స్థాయిలకు భిన్నభిన్న విపులార్థాలను భాసింపజేయాలన్న షరతును ఉపసంహరించుకోదు. కనుకనే ఆలోచనామృతంగా భాసించి రసజ్ఞ హృదయ మణిదీపాలుగా వెలిగిన పూర్వ కావ్యాంతర్గత వాక్య సందోహాన్ని ఎంతయినా చూపవచ్చు.

రూపర్ట్ బ్రూక్ అనే ప్రఖ్యాత ఆంగ్లకవి ఒకచోట నిరాడంబరంగా ఒక మాట అన్నాడు: 'The rough male kiss of blankets' అని. ఈ అల్పమైన వాక్యంనుంచి మనం అనల్పమైన భావాన్ని చేదుకోవచ్చు. దుబ్బు మీసాలుగల మొగవాడి ముద్దు ఉన్నిరగ్గు కప్పుకున్నప్పుడు కోమల కపోలాలకు

గుచ్చుకోవడంలా ఉందిట. ఈ వాక్యంలో ఇంత మనోహర భావాన్ని అభివ్యక్తం చేసిన పదాలు మూడే మూడు: rough, male kiss, blanket. ఇంతే...దీనితో తరంగితమైన ఆలోచనా ధార ఎంత దూరమైనా ప్రవహిస్తుంది. అలాగనే శ్రీ శేషేంద్ర, "పక్షుల గొంతుల్లో పాటను పుచ్చుకొని పారిపోయింది రాత్రి" అని అన్నా "ఆశలూ రక్తబిందువులు కలిపి, అల్లిన దండ వేసుకొస్తున్నాడు" అనినా, "సముద్రాలలో సముదగ్ర కెరటాలు లేపాడు; కొండలు దిండ్లుగా విశ్రమించాడు; ఉషస్సు వాడి ముఖంమీది చెమట బిందువుల్ని రక్తపు మరకల్ని తుడుస్తోంది" అని అనినా అల్పమైన పదచిత్రాలలో అనల్పమైన భావకాంతిని సాంద్రతరం చేయడమే కనిపిస్తుంది.

కనుకనే కవితలో ప్రతి పదమూ అతి జాగరూకతతో మథింపబడి ప్రయుక్తం కావాలి. ఆ పదానికి ఆ స్థానంలో అనివార్యమైన స్థిరత్వం ఏర్పడాలి. ఉజ్వలశక్తి, అనవద్య రక్తి లభించాలి. అప్పుడే ప్రతి కవితా మననయోగ్య మవుతుంది. పాఠకుని మనోపటలంపై పదికాలాలపాటు మనగలిగే పదాల నద్దుతుంది.

Emily Dickinson అనే అద్భుత కవయిత్రి జీవితమంతా అతి లఘు కవితలనే రచించింది. కానీ అవే అతివేల రామణీయకత్వానికి కాణాచులయ్యాయి. ఆమెకు శాశ్వతకీర్తిని ప్రసాదించాయి. ఆమె బ్రతికిఉండగా ఒక్క కవితనయినా ఒక్క

పత్రికలోనూ ప్రచురించలేదు. రాసిన ప్రతి కవితనూ ఒక పాత ట్రంకుపెట్టెలో భద్రపరచింది. అయితేనేమి! ఒక తపస్వి హృదయంనుంచి వెలువడిన శక్తి అజరామరమయింది. ఆమె ఒక చోట ఇలా అంటుంది :

'I lost a word the other day
Has anybody found ?
You will know it by the row of stars
Around its forehead bound'

అలా ఉండాలి కవితలో ప్రయుక్తమైన పదాలు. అంత అద్భుతంగా మెరిసే పదాలను ప్రయోగించగలిగే శక్తి పూర్వకావ్యగాథ పరిచయంద్వారా లభిస్తుంది. వారసత్వాన్ని రక్తనిష్ఠం చేసుకోగలిగే కవికే ఆ శక్తి సాధ్యమవుతుంది. ఇలాంటి శక్తియుక్తుల్ని శేషేంద్ర అక్షరాలా తన హృదయమగ్నం చేసుకున్నాడు. ఎంత అలవోకగా ప్రయోగించినా ప్రతి పలుకుబడికీ ఎంతో నవ్యతేజాన్ని ఆవహింప జేస్తాడు. లోతుకుదిగి ఆలోచించేవారికి ఎంతో సంప్రదాయ భూమిక ప్రతి పదంలోనూ సంతరించబడిన సత్యం సునాయాసంగా బోధపడుతుంది.

——

నాలుగవ ప్రకరణము :

# శేషేంద్ర కవితలో ఉత్కృష్ట విజయాలు

కవికి పదాలు తప్ప మరే యితర సాధన సామగ్రీ లేదు. భాష ఒక్కటే అతని కళాప్రదర్శనకు భూమిక వహిస్తుంది. ప్రతి పదమూ దానిదైన స్వయంప్రతిపత్తితో, స్వీయ అర్థపరిధిలో బ్రతుకుతూంటుంది. అట్టి పదాన్ని స్వీకరించి తన కనుకూల ప్రతిపత్తిని అభివ్యక్తిని సాధించేదీ, తా నుద్దేశించిన సౌందర్య రూపాన్ని ఆపాదించేదీ, ప్రయోగ సౌరభ్యాన్ని స్థాపించేది కవి ప్రతిభయే అంటే కవి ప్రయోగ నైపుణిలో పదాలకు స్వతహాగా లేని శక్తియుక్తులూ రాగరక్తులూ వాటి జీవనాడులలో ఆవేశింపబడతాయన్న మాట. వాటికి నిఘంటువులలో ఉండే విలువలకన్న కవితోక్తిమయ ప్రపంచంలో అతి వేలంగా పెరిగి చిత్ర విచిత్రమైన భావస్ఫోరకత్వాన్ని కలిగించగలవని అర్థం.

అయితే ఈ శక్తి ఎలా సంభవమవుతుంది ? కవితా సంప్రదాయాన్ని ఆకళించుకున్న కవికి పదప్రయోగశక్తి ఒక వారసత్వంగా సంక్రమించి రక్తనిష్ఠ మవుతుంది. వైయక్తిక రసావేశమూ కాల్పనికశక్తి ఇంద్రియసంబంధి వాసనాసంపదా వంటి వన్నీ కవి శక్తికి విశిష్టతను చేకూరుస్తాయి. పదాల నేపథ్యం

నుంచి ఎన్నో రుచులూ ఎన్నో రంగులూ ఎన్నో వాసనలూ పతితహృదయపరికరాన్ని ముంచెత్తుతూ అతని మనస్సులో కవికి పునర్జన్మ కలిగిస్తాయి.

ఈ రసయోగంవల్లనే సామాన్య పదాలకు ఒక సిద్ధి లభిస్తుంది. ఆ సిద్ధి కవి ప్రతిభాజన్యమైన చమత్కార సంయోగం వల్ల కలిగినదే. చిత్రం, భాష వ్యవసాయ క్షేత్రంలాంటిది. ప్రతి పంట తరవాతనూ ఎప్పటికప్పుడు దాని ఉపరితలం సారహీన మవుతూ ఉంటుంది. తిరిగి సేంద్రియ ఎరువులద్వారానో ప్రాకృతికమైన ఎరువుల ద్వారానో ఆ వుపరితలానికి పునశ్శక్తి కలిగిస్తూ ఉండాలి. భాషాపరంగా ఇది ఒక కవి వ్యక్తిగత ప్రతిభ వల్ల భాషకు సంక్రమింపచేసిన భావనాబలంవల్ల తిరిగి సారభూత మవుతుంది. అంటే కవితాశక్తిద్వారా భాషకు నూతనోజస్సు చేకూరుతూ ఉంటుందన్న మాట. "పక్షి నెల్లాదు నీవెట్లు పతిత వౌదు!" అంటారు కృష్ణశాస్త్రి కావ్యనాయిక ఊర్వశితో. ఆమె అమృతాభిషిక్త. నిత్యయౌవన పరిపూర్ణ. ఆమె ఎప్పటికీ పతితకాదు. ఇది వ్యంగ్యార్థం. ఈ వాక్యంలోని సాధారణార్థం దానికి కొంచెం భిన్నంగా ఉంటుంది; ఆమె అందని ఆకాశలోకాలలో విహరిస్తూ ఆశలు గొలుపుతోంది. తానా ఆమె నందుకుందుకు పక్షి కాలేదు. మానసిక భావనా పక్షాలతో ఎంత ఎత్తుకు ఎగరగలిగినా, భౌతికంగా నేలబారుగా బ్రతకక తప్పదు. ఆమె ఆకాశ లోకాలనుంచి ఊడిపడి అతనికోసం భూమిని చేరదు. ఈ చేరకపోవడాన్ని పతిత వెల్లాదు అంటూ సామాన్య పదానికి

అసామాన్యార్థాన్ని కల్పించి పునశ్శక్తి కలిగించారు. అంటే భాషకు కాయకల్ప చికిత్స చేశారన్న మాట. ముసలిభాషను కృష్ణశాస్త్రి పునర్‌యౌవనగా మార్చి నాగరీక చేశారని నేనిది వరలో అన్న మాటకు ఇదే అర్థం.

"ఇన్నాళ్ళెక్కడున్నావు నీవు" అన్నాయి
నా పెదవులు మృదువులైన అక్షరాలుగా మారిన
జన్మాంతర నిరీక్షా మధువుతో తడిసి,

అని శ్రీ శేషేంద్ర ఆ 'రెండు కళ్ళు' అనే కవితను ప్రారంభిస్తాడు. ఇన్నాళ్ళూ ఎక్కడున్నావని అడిగిన పెదవులే మృదువులైన అక్షరాలుగా మారాయి. ఆ మార్పు ఎలా సంభవించింది ?— జన్మాంతర నిరీక్షా మధువుతో తడిసినందువల్ల-ఎక్కడో ఉన్న ఆమెను జన్మజన్మలుగా తాను వెదుకుతున్నాడు. నిరీక్షను అగ్నితోనో బాధతోనో రూపకం చేయడం పరిపాటి. కాని ఇతని నిరీక్షణ మధువై జన్మజన్మలుగా అతని పెదవులను తడుపుతోంది. మృదూక్తులుగా మారుస్తోంది. సాధారణ శబ్దాలకు అసాధారణ అర్థాల రథాలను పూన్చగలిగే కవిశక్తి అంటే ఇదే !

గతకాలపు కవులు కవితా పరిభాషను (Poetic idiom) నిబద్ధిత కవి సమయాలతో గతానుగతిక రూపకాలతో శిలీభవింప చేశారు. కాని ఆ పరిమిత కావ్యభాషలోనే ప్రతిభావంతులు తమదైన ఉపజ్ఞను ప్రదర్శించారు పదాలకు కొత్తజిలుగు లంటించి ప్రయుక్తంచేస్తూ సంప్రదాయపు పలుగురాళ్ళ దారిలో నూత్న

వారసత్వాన్ని సంతరిస్తూ వచ్చారు. ఇది కేవలం ప్రజ్ఞాధురీణులు ఘటనాఘటన శక్తిపై ఆధారపడి పెంపొందిందే. ఈ స్వీయ చమత్కార శక్తినే ఆధునిక కవి ఒక పరిమళభరిత వారసత్వంగా స్వీకరించవలసి ఉంది. పాతకాలపు కవులలో ప్రతిభావంతులు ఆనుపూర్వికంగా జీవిస్తూవచ్చిన మనోహర భాషాప్రయోగాలను కాపాడి పెంపొందించి తరువాతి తరం వారికి అందించారు. అంటే జీవశక్తికల సృజనాత్మక కవులు ఈ భాషా చైతన్యాన్ని వర్ధమానం (promote) చేశారని మనం అర్థం చేసుకోవాలి. ఈ అంతస్సూత్రం వల్లనే ఏ తరమూ తన పితరుల తరంలాగనే అచ్చుమచ్చుగా భాషను ప్రయోగించదు. అలాంటి ప్రయత్నం చేసిన వాడెవడైనా ప్రతిభావంతుడుగా, స్రష్టగా గణుతికెక్కడు. దేవులపల్లి సోదరకవుల భాషకు వారి పుత్రులైన కృష్ణశాస్త్రి ప్రయోగించిన భాషకూ నడుమ జరిగిన క్రమ పరిణామాన్ని అవగాహన చేసుకుంటే ఈ విషయం స్పష్టపడుతుంది. కేవలం పితరుల తరంలోని భాషాప్రయోగాలను మాత్రమే వాడినవారు మూడవరకం అనుకరణవాదులై మిగులుతారు. వారి సృజనలను నిర్జీవ ప్రతిమలుగా మార్చుకుంటారు.

ఈ కారణం వల్లనే ప్రతి ప్రతిభావంతుడూ స్వయం ప్రకాశ శక్తితో కవితాపరిభాషను పునర్నిర్మించుకోవడం తప్పని సరి. అలాంటి శక్తిమంతుడే వినూత్న ప్రయోగాలు సంతరించ గలడు. అందువల్లనే కవితాచరిత్ర భాషాపరిణామ చరిత్రగా ఒక దృక్కోణం నుంచి పరిశీలించినవారికి దర్శనమిస్తుంది. అయితే ఈ

పరిణామం భౌతిక స్వరూపంలో కాదు, అంతస్సత్త్వంలోను అంతశ్చైతన్యంలోనూ నిరామయంగా జరుగుతుంది.

సాధారణంగా కవులు ప్రతి తరంలోనూ భాషాపరంగా అనుసరించే సంప్రదాయం పట్లగాని, సాధించవలసిన పరిణామం పట్లగాని అనభివ్యక్తంగా ఒక వినూత్న సిద్ధాంతాన్ని తమ హృదయాలలో పాదుకొల్పుకుంటారు. కవి మనస్సులో స్థిరపడే ఈ అనభివ్యక్త సిద్ధాంతానికి దోహదకారులైన శక్తులివి. ఒకటి: కవి వ్యక్తిగత అభిరుచి; రెండు : అతని కాలంలో ప్రచలితమవుతున్న ఆర్థిక, రాజకీయ, సామాజిక విశ్వాసాలు; మూడు జాతిలో మోసులువారుతున్న తాత్విక సిద్ధాంతాలు; నాలుగు అన్నిటికీ మిన్నగా ఆ యుగధర్మంలో ప్రపంచింపబడుతున్న సాంకేతిక సమస్యలు, అంటే ఉత్పత్తి సాధనాల పరిణామం.

ఇట్టివన్నీ కలిసి ఒక కవి బాణీని, యాసనీ, అభివ్యక్తి సాధనాలనూ నిర్ణయిస్తాయి. పదజాలంలో వినూత్నార్థాలను ప్రతిపాదిస్తాయి. పాతభాషకు నూత్న జవసత్వాలు చేకూరుస్తున్నాయి...ప్రతి ప్రతిభావంతుడైన కవీ భాషాపరంగా తనకు సాధ్యమయిన సమస్తావకాశాలనూ వినియోగించుకుంటాడు. సావకాశాల నన్నిటినీ వాడుకుంటాడు. కొన్నిచోట్ల అభివ్యక్తిని ఎంతో నిరాడంబరంగా సాధిస్తాడు. మరికొన్నిచోట్ల భాషాపరంగా pose & posture ని ప్రతిష్ఠించి జటిలంగా పటాటోపంగా పోషిస్తాడు. సందర్భాన్నిబట్టి రెండింటికీ ఉచిత స్థానమే ఉంటుంది. పిడుగుకీ బియ్యానికీ ఒకటే మంత్రం ఉచ్ఛ

రించేవాడు కవయినా బిచ్చగాడయినా నవ్వులపాలు కావలసిందే. కొన్నిచోట్ల అతి విశాలమయిన భావాన్ని అతి క్లుప్తంగా అభివ్యక్తంగా చేస్తాడు. సాధారణ పదాలకు సాంద్రతరార్థాలను కల్పిస్తాడు. వేరొకచోట సామాన్య భావాన్నే విస్తృతపరచి ఒక కొత్త మానసిక స్థితిని ప్రదర్శించవచ్చు, ఏది ఎలాఉన్నా సందర్భశుద్ధి, ఔచితీవిచారణా ప్రతిభావంతుడైన కవికి సహజాతాలు. కవి ఎక్కడెక్కడ ఏఏ విధాలుగా వర్ణనాశక్తిని ప్రదర్శించాలి అనే ప్రశ్నకు ఎక్కడా చెప్పబడిన నిశ్చిత సిద్ధాంతాలంటూలేవు. కొన్నిచోట్ల అవసరమయిన వివరాలనే తొలగించి భావప్రకాశాన్ని మరుగుపరిచిన కవి వేరొకచోట వాంఛితార్థాల పునరుక్తిని సంధించి ఒక ఓజస్సును సాధిస్తాడు. ఈ లక్షణాలన్నీ శ్రీ క్షేమేంద్ర తన కవితా మహేంద్రజాలంలో ప్రదర్శించిన విశిష్ట ప్రతిభకు తార్కాణాలు.

'ప్రతి కళాకారుడు తన స్వీయ జీవితచరిత్రనే వ్రాసుకుంటాడు' అని ప్రఖ్యాత రచయిత హేవలక్ ఎల్లిస్ అన్నాడు. (Every artist writes his own autobiography : Henry Havelock Ellis). అంటే దీని అర్థం ప్రతి కళాకారుడు వీరేశలింగంగారిలాగో, గాంధీజీలాగో కూర్చుని తన స్వీయ చరిత్ర రాసుకుంటూ పోతాడని కాదు. కళాకారుల్లో ముఖ్యుడైన కవి రచించే కవితలలో తన స్వీయచరిత్ర భంగ్యంతరంగా తన పాదముద్రలను పొదుకోల్పక మానదని మాత్రమే అర్థం చేసుకోవాలి. అందుకే ప్రఖ్యాత మార్క్సిస్టు సాహిత్య లక్షణ

కర్త క్రిస్టఫర్ కాడ్వెల్ ధైర్యంగా ఒక మాట అనేశాడు : 'All poetry is subjective' అని. కవి అనేవాడు పురాణం రాసినా, ఇతిహాసం రాసినా, కథనకావ్యం రాసినా అతని స్వీయాత్మాశ్రయత్వం ఆ కళాఖండానికి ఆపాదింపబడకుండా పోదు. జీవితాన్ని పరాత్మకదృష్టితో పరిశీలించి కవి కావ్యాలు రాయాలిసిందేనని కొందరు మార్క్సిస్టు శ్రోత్రియులు అన్నారని కాడ్వెల్ కు బాగా తెలుసు. కనుకనే ఇంత ఖచ్చితంగా– 'తాంబూలా లిచ్చేసాను తన్నుకు చావండి' అన్నంత నిష్ఠురంగా పై మాట అనేశాడు. ఈ ఉద్ఘాటనలోని పరమ సత్యాన్ని కవి అనిపించుకున్న ప్రతివాడి కవితలనుంచీ వెలికి తీయవచ్చు.

'అదృశ్యమైపోయిన నా బ్రతుకుల కోనల్లో కానల్లో
ఒయ్యారంగా, దారికోసం ఇటూ అటూ
సంచరిస్తున్న ఒక అవ్యక్త షహానాయీ స్వరఝరి,
నీరవ చరణవిన్యాసాలతో వచ్చి ఉషస్సు
చుంబించే నిశ్చల వనభూములలోకి
చంద్రకిరణంనుంచి మెల్లగా జారివచ్చిన
ఒక అప్సరసలాంటి హిందోళరాగలహరి
చెంగావి లే యెండలవంటి వలువలు దాల్చిన రాజ
మహిళలు

[శేషజ్యోత్స్న : ఆ రెండు కళ్ళు; పుట 6]

అతని బ్రతుకుల కోనలూ కానలూ అదృశ్యమైపోయాయి. వాటిలో ఒయ్యారంగా సంచరిస్తూ, దారికోసం

వెతుక్కుంటూ, ఒక అవ్యక్త షహానాయీ నాదఝురి ప్రవేశించింది. అది ఎలా ప్రవేశించింది ? నీరవ చరణ విన్యాసాలు పరపుతూ వచ్చే ఉషస్సులా ప్రవేశించింది. నిశ్చల వనభూములను ఆ ఉషస్సు చూపిస్తున్నది. చంద్రకిరణం నుంచి మెల్లగా జారివచ్చిన ఒక అప్సరసలాంటి హిందోళ రాగ లహరిలా తన బ్రతుకు కోనలూ కానలూ అదృశ్యమై పోతూఉండగా వచ్చి వసంత వనవాటికలుగా తీర్చి జారిపోయే అన్నిటినీ పునరుజ్వలింప చేసింది. ఆ హిందోళ రాగలహరిలోంచి లేయెండలవంటి చెంగావి వలువలు దాల్చిన రాజమహిళలు తేలివచ్చినట్లు తన బ్రతుకు మెరిపింప చేసింది-అని తన గుండెను విప్పి పదచిత్రాలుగా మార్చి, దారిపొడుగునా పోగులుపోగులుగా రాల్చి, అతని కవిత ముందుకు సాగిపోతుంటే - మనం ఇది పరాత్మకమా, స్వాత్మకమా-లేక ఇది వస్త్వాశ్రయమా, ఆత్మాశ్రయమా, అనుకుంటూ, దేన్ని ఏ పోస్టల్ సంచీలోకి తోయాలో తెమలని సార్టర్‌లా తెల్లపోతాం. కారణమేమంటే కవి ఇక్కడ ప్రదర్శించిన అహమిక వ్యక్తిగత అహమిక కాదు. అది సామాజిక అహమిక (Social Ego). మంచి కవితాకళ ఎన్నడూ ఎల్లిస్ చెప్పినట్లుగా కళాకారుని స్వీయచరిత్ర- పరిధినుంచి తప్పించుకుని పారిపోదు.

'చెలికత్తెలు 'ఋతుగీతిక' లాలపిస్తుంటే
కురంగి కన్నులు విప్పి చూస్తుంటే
రంగులు విహంగి పురివిప్పి నటిస్తుంటే
ఓ! ఏమి స్మృతులు! ఎన్నో స్మృతుల వెనుక
నిలిచి పిలిచే సుందరాకృతులు!'

అదే కవితలో సహృదయ పరిశీలకుడు ఉల్లేఖించకుండా, వ్యాఖ్యానించకుండా విడిచిపెట్టగలిగే వాక్యాలెన్నో లేవు. వ్యాఖ్యాత తన లాలసలను నిగ్రహించుకోలేక తికమక పడిపోయే సుందర దృశ్యాలు కోకొల్లలుగా చిత్రింపబడ్డాయి. చెలికత్తెలు ఋతు గీతిక లాలపిస్తున్నారు. అంటే ఆర్తవ సమయోచిత గీతిక లాలపిస్తున్నారని; అంతే కాదు- తామే ఆర్తవ ఆర్ద్రాశ్రీకృతులై ఆహ్వాన గీతిక లాలపిస్తున్నారు- అనీను. ఇలా ఈ వాక్యం దేహళీనిక్షిప్త దీప కళికలా రెండువైపులా కాంతిని ప్రసరిస్తుంది.

శ్రీ శేషేంద్ర తన కవితల బయళ్ళ హాయిళ్ళను విస్తృత పరుస్తూ పోతుంటే వాటిపై నడచివెళ్ళే సహృదయం ఆగి ఆగి తూలుతూ త్రుళ్ళుతూ, పడుతూ, లేస్తూ ఉంటుంది. ఈ కవి అలవోకగా పన్నిన పదచిత్రాల వలలకు అడుగడుగునా తన పాదాలు చిక్కుపడి వెలికిరాక తన్నుకొన వలసివస్తుంది. ఆగి చిక్కులు విడదీసుకుని ఆలోచనా పారమ్యంలో స్వాస్థ్యం పొందితే తప్ప ముందుకు సాగలేని అశక్తతకు లోనవుతుంది. ఈ తన్నుకోవడం అన్వయ క్లిష్టతవల్లకాదు. అయోమయత వల్ల కాదు. పదచిత్రాల పోకులతో పాఠక హృదయం వివశీభూతమై ఆ తావులు విడిచి ముందుకు సాగలేని నిశ్చలస్థితికి చేరుకుంటుంది. అదే పారవశ్యం.

ఈ శేషజ్యోత్స్నలోని ప్రతికవితా ఒక కోమల జ్యోత్స్న. విద్యూభూతిని పచరిస్తూ సాగుతుంది. కవి స్వీయ జీవితజన్య సత్యాలను

సునాయాసంగా, వనజ్వాలికా కుసుమోత్కారంగా రాల్చు
కుంటూ సాగుతుంది. అవి అలా రాలినా రక్తవర్ణాంకితాలై మన
గుండెలకి కొత్త నెత్తురెక్కించక విడువవు.

'ఒక నూతన యుగ సూర్యుడు ఉదయిస్తున్నాడు
మనకొక కానుకగా పట్టుకు వస్తున్నాడు
ఒక నూతన గీతను
విప్లవాన్ని, వీరమరణాన్ని ఉద్ఘోషించే
ఉచ్చైస్స్వర గీతం.'– (నూతన తీరాలు; పుట:8)

నూతన యుగ సూర్యుడుదయిస్తున్నాడు. మనకు కానుకగా ఒక నూతన గీతను తెస్తున్నాడు. అది విప్లవాన్నీ వీరమరణాన్నీ ఉద్ఘోషించే ఉచ్చైస్స్వర గీత! అలా భావించిన కవికి ఆ కానుకను గీతిక అనడం తేలికే. కాని కవి కావాలనే దానిని గీత అన్నాడు. ఆ మాటతో మన పురాస్మృతుల వాసనావాసితజ్ఞాన భాండాగారాన్ని ఒక్క కుదుపుతో కదిలించి వేస్తున్నాడు. నరునకు కర్తవ్యోపదేష్టగా నిలచిన ఉచ్చైస్స్వరానికి గీత ఒక సంకేతం. మానవుడు ప్రతితరంలోనూ తంద్రాలసుడవుతాడు కర్తవ్యతా విమూఢత్వం ఆవహించి నిశ్చేతనుడవుతాడు. అతనిని సూర్య సదృశుడైన కవి మాటిమాటికీ గుండెల్ని తట్టి మేల్కొలపాలి. ఇలా జాగృతీ కారకమైన ఋతుపవనాలు శేషేంద్ర కవిత నిండా క్రిక్కిరిసి, తమ పనిలో తాము నిమగ్నమై వెళ్ళిపోతున్నంత నిరాడంబరంగా సాగి పోతూ ఉంటాయి.

తాము వీరశైవుల మని చెప్పుకుంటూ, వీలయినప్పుడల్లా గుళ్ళనీ గుళ్ళో లింగాలనీ గుటకాయస్వాహా చేసే అప్రతిభ కబంధులు సాధించలేని ఉత్కృష్ట విజయాలను శేషేంద్ర కవిత సునాయాసంగా సాధించగలుగుతుంది. కేకలూ పెడబొబ్బలూ లేకుండా, బాజాలూ భజంత్రీలూ లేకుండా కవిగా అతను— 'రెండు ముక్కలు చెపితే అవే రెండు రెక్కలై — ఊహా విహాయసంలో కెగిరిపోయే' సిద్ధిపొందినవాడు.

కవితా కౌశలం అంటే మామూలు పదాలను చైతన్యవంతమైన కృత్యాలుగా మార్చడమే. ఒక వచనంలోనూ ఒక కవితలోనూ ఒకే పదాలు ఉపయుక్తమైనప్పటికీ కవితలోని పదాలకు మాత్రమే స్వయంవ్యక్తిత్వమూ ఉట్టిపడుతూ ఉంటుంది. దానికి కారణం కవి ఆంతరిక చైతన్యం ఆ పదాలలో పరకాయ ప్రవేశం చేస్తుంది. వచనానికీ కవితకీ జీవలక్షణాలలో గల ప్రధానమైన ఏ భేదం ఇదే. కవి ఎంత కుశలుడైతే అతడు వాడే పదాలు అంతగా పదును తేరుతాయి. నవీన నైశిత్యంతో భాసిస్తాయి. ఆ పదాలద్వారానే అమేయభావాభివ్యక్తికి దోహదం లభిస్తుంది. ఒక కోమల గాంధర్వం ఉద్భూతమవుతుంది. ఒక సుకుమార రేఖాచిత్రం సాక్షాత్కరిస్తుంది. నిరవధిక విశాలార్థాలు మనోఫలకంపై ఒరుసుకునే రంగుల బొమ్మలను ఆడిస్తాయి. పాఠకుని జ్ఞాపకాలనూ, విస్మృతాను భూతులనూ మేల్కొలుపుతాయి. మూగవోయిన కాంతుల్ని పునరుజ్వలింపచేస్తాయి. ఈ విధంగా మాటలతో ప్రజ్ఞావంతుడైన కవి ఒక గొప్ప బొమ్మలాటనో,

లేదా ఒక చిత్ర ప్రదర్శననో ప్రతిపుటలోనూ ఆవిష్కరిస్తాడు. కవితా శ్రోత లేదా పఠిత స్వచ్ఛహృదయమే తెల్లని తెరగా ఈ బొమ్మలాటకు సహకరిస్తుంది. ఇక్కడే ఒక చక్కని ఉదాహరణను చిత్తగించ వలసి ఉంది. Willam Blake మహాకవి ఒక చోట ఇలా రాశాడు:

'O! Rose thou art sick
The invisible worm
That flies in the night
In the howling storm
Has found thy bed
Of crimson joy...
And his dark secret love
Does thy life destory.'

పై కవితాశకలంలో కవి అచ్చంగా గులాబీ గురించే చెప్పదలుచుకోలేదు. నిజానికి ఏమీ చెప్పదలుచుకో లేదన్నా అతిశయోక్తి కాదు. పోనీ తాను నర్మగర్భంగా ఏ భావాన్ని ప్రదర్శించ దలిచాడో, దాన్ని వివరించే సమాంతర సంకేతాలు ఏమీ లేవు. రూపకాలు లేవు. కేవలం కొన్ని ప్రతీకలు, పదచిత్రాలు ప్రయోగించి చెప్పబడిన అంశాలకన్న అతీతమైన అర్థంతో చెప్పబడని అంశాలకు ప్రాణప్రతిష్ఠ చేస్తున్నాడు. భౌతిక స్వరూపాలతో మన కనుల ముందు వర్ణితమై దర్శనమిచ్చే వస్తువుకీ, మన రసావేశ పరికరాన్ని దీప్తివంతం చేస్తున్న ఆంతరిక ధాతువుకీ గల సాదృశాలు వాచ్యంచేయబడలేదు.

అయినా ఈ కవిత తక్షణమే మనకు మూడుస్థాయిలలో దర్శన మిస్తుంది. ఒకటి గులాబీ, దాని మనోహరత్వం, ప్రస్తుతం దానికి కలిగిన బాధ. రెండోది రాత్రించరమైన ఒక దుష్ట కీటకం తద్వారా నలిగి వ్యధ చెందిన గులాబీ. మూడోస్థాయిలో నర్మ గర్భంగా లోకంలో సాధారణంగా జరుగుతున్న సామాజిక దౌష్ట్యాలు ధ్వనింపబడుతాయి. రాత్రించరత్వం సహజ లక్షణ మయిన ఒత క్రౌర్యజీవి అవినీతికరంగా పూబోణి పజ్జను చేరి ఆమె సౌశీల్యాన్ని విధ్వంసం చేసి ఆమెను వ్యధలపాల్జేయడం; అంటే లోకంలో జరిగే అన్యాయాలు అక్రమాలు ధ్వనింప బడ్డాయన్నది స్పష్టమే. ఈ మూడు స్థాయిలు ఒక్కసారిగా మన హృదయంలో తళుక్కుమంటాయి.

ఇంతశక్తినీ ప్రదర్శించిన దేది? ఒక్క వాక్యం 'Has found out thy bed of crimson joy.' అతి సామాన్య మైన పదాల చాటునుంచి అతిభయంకర సన్నివేశం ద్యోతకమవుతుంది. నిజానికి కవితలో స్థూలదృష్టికి కనిపించేది అంత బాధకరమేమీ కాదు, సాధారణమైనదే. తోటలో చక్కగా వికసించిన ఒక గులాబీ పువ్వును రాత్రి తుఫానులా హోరు పెట్టే ఒక దుష్ట కీటకం తినేసింది. గులాబీ పువ్వు తూట్లు పడి పోయింది. అంతే అది చాలా సార్లు మన మందరమూ చర్మ చక్షువులతో చూస్తున్నదే. విలియం బ్లేక్ కవీ చూశాడు. ఆ యథార్థ చిత్రాన్ని అంతర్నేత్రంతో పునర్దర్శించి వేరొక సన్నివేశాన్ని తెలపడానికి ఉపయోగించుకున్నాడు. ఆ ఉపయోగించు

కోవడంలో కవి తానుగా కలగచేసుకొని స్వీయహృదయా వేదనల్ని ఆక్రోశాల్ని వెలిగ్రక్కుతూ బావురమనలేదు. ఒక యథార్థాన్ని వివరిస్తున్నట్లే నిర్లిప్తంగా (detached) చిత్రిం చాడు. అంటే కీటక బాధితమైన గులాబీని చిత్రించదలుచు కున్నపుడు ఆ బొమ్మనే పుష్టిగా వేసి చూపించాడు.

కాని ఆ పదాల పోహళింపులో సాక్షాత్కరించిన పదార్థాల ద్వారా ఒక అదృశ్యలోకవృత్తం దర్శన మిస్తోంది. చెప్పిన మాటలు మోయగలిగిన నైసర్గిక అర్థాలకన్న ఉత్తమార్థాలను వాటికాపాదించడం జరిగిందన్నమాట. ఇదే కవిత కలిగించే ఐంద్రజాలిక మంత్రశక్తి. ఆ పదాలు కలిగించిన స్ఫురణ, గులాబీపరంగా కూడా వాచ్యం చేయకుండా కేవలం ధ్వని ప్రధానంగా సంయమితమైంది. పదచిత్ర సంజ్ఞల ద్వారా ప్రతీకలద్వారా లోకవృత్త ప్రదర్శన జరిగింది. ఒక రామాయణ మంత గాథ మన మనోనేత్రానికి అవగతమయింది. ఆ గులాబీ పువ్వులో ఒక శోకతప్త సీత కథ మన గుండె లోపలి గుండెలో మ్రోగనారంభించింది. అయితే ఈస్ఫురణ యావత్తూ పాఠ కుడుగా మనం మన ప్రజ్ఞవల్ల మాత్రమే కనిపెట్టి సాధించు కున్నదికాదు. కవి గురి చూసి సంధించిన కవితా బాణమే మన హృదయ గ్రంథిని వివృత్తం చేస్తోంది.

కవి గులాబీ పువ్వు దీన గాథను తెలుపుతూనే ఒక అంతర్నాటకాన్ని మన మనస్సులోపలి కన్నులముందు ఆవిష్క

రించారు. నిజానికి ఆ అంతర్నాటకంలో గులాబీ పువ్వుగానీ తోటగానీ, అందులో స్వేచ్ఛగా విహరించే కీటకం గాని పాత్రధారులు కానేకావు. అయితే ఇంత శక్తిని ఈ కవి సాధించాడే, ఈ సంఘటనను తార్కిక బుద్ధితో విశ్లేషించగలమా అంటే సాధ్యంకాదని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు. తర్కానికీ కవితా కాల్పనికత్వానికీ సమన్వయం ఉండదు. ఎక్కడ తర్కం తలెత్తుతుందో అక్కడ కవిత్వం నిష్క్రమిస్తుంది. ఎందుచేతనంటే కవి అభివ్యక్తికీ ధ్వనికీ మధ్య ఆంతరికానుబంధం వాచ్యం కాలేదు కనక తర్కానికి తావు లేదు. కవి ప్రయోగించిన పదాలన్నీ స్థూలంగా సాధారణమైనవే. అల్పమైనవే. కాని వాటి కవితా నిర్మాణంలో అనల్పార్థసందోహాన్ని అందుకున్నాయి. ఆ పదాల కేదో ప్రాణారోపణం జరిగింది. సామాన్య శబ్దాలనుంచి అసామాన్యార్థాలను ప్రతిపాదించడం జరిగింది 'Thy bed of Crimson Joy' అనే మనోహర పదచిత్రం- ఆ గులాబీ పువ్వు పూర్వ జీవితం ఎంత రమణీయంగా ఉండేదో తెలిపేందుకు సహకరిస్తుంది. దాన్ని ఆ కీటకం ఛిద్రంచేసిందని ధ్వనించడానికి నిరోధకశక్తులుగా వ్యతిరేక పదచిత్రాలు నెలకొల్పబడ్డాయి. ఈ రెండు రకాల పదచిత్రాలు ఒకదానికొకటి ఎదురుబదురుగా (Confronted) నిలిచాయి. అందుకే డిలాన్ థామస్ ఇలా అంటాడు: 'Out of the Conflict of images I try to make that momentary peace which is calleda poem' అని Bed, Crimson, Joy లకు ఎదురుగా sick, worm, stormy

night లు ప్రతిష్ఠిత మయ్యాయి.Howling storm, found out, dark secret love and destroy అనే పదాలు పర్యవసాయిగా ప్రయుక్తమయ్యాయి. అయితే ఆ కీటకం దేనికి ప్రతీకగా నిలిచిందో చెప్పబడలేదు. కామమా, క్రౌర్యమా, పాపమా, మరణమా- ఏదో స్పష్టాస్పష్టం గా నిలుస్తుంది. అలా అగోచరమై అందులో నిక్షిప్తమైన ఇంద్రజాలానికి దోహదం చేసింది. ఈ సంఘటనలో ఒక దట్టమైన తమస్సు కనులకు కనిపిస్తుంది.కవి వర్ణించిన రాత్రి కన్న దట్టంగా అది అలుము కొని ఉంది అలా హోరు పెట్టే తుఫాను ఆ భీభత్సం నిజాని కీటక సంచారం వల్ల ఏర్పడ్డ హోరే. అది గులాబీ జీవితానికి కంత భయానకంగా తయారయింది అది కవి చెప్పదలుచుకున్నాడు, దానితో కవి భావన from particular to Universal విస్తరించింది.

ఇలాంటి విపుల వ్యాఖ్యానం అడుగడుగుకీ అపేక్షించే అద్భుతావహ కవితా మాధుర్యాలు (శ్రీ) క్షేమేంద్ర క్షేమ జ్యోత్స్న నిండా నిబిడీకృతమై ఉన్నాయి. ఎన్నో ప్రతీకలు ఎన్నో పదచిత్రాలు అమూర్త భావనలకు మూర్తిమంతం చేసి స్థూలదృష్టికి సైతం విస్పష్టంగా కనిపించే తళుకు లెన్నో క్షేమ జ్యోత్స్నలో చల్లని కిరణాలను క్రుమ్మరిస్తాయి. చెంగు చెంగున దూకుతాయి. ఎంత విపుల వ్యాఖ్యానమైనా తన బాధ్యతను చివరికి స్థాలీపులాకంగానే నిర్వహిస్తుంది. పరిత దర్శనకు కావ్యావగాహనకు సుస్థిర పదాన్ని కేలెత్తి చూపుతుంది. అంతే! మిగిలిన భారమంతా రసగ్రహణ పారీణుడయిన పాఠకుడే వహిం

చాలి. పాఠకునికి ఏ మాత్రం ఆలోచించవలసిన అవసరంలేకుండా తానుగా చెవికి ఇల్లు కట్టుకుని చెప్పే కవికి మల్లేనే వ్యాఖ్యాతకు కూడా నిష్ప్రయోజకత్వమే ఎదురౌతుంది. పాఠకజన బాహుళ్యంనుంచి నిరర్థకత, నిష్క్రియత మాత్రమే ప్రతిఫలంగా లభిస్తుంది. ఈ ముప్పునుంచి నన్ను నేను కాపాడుకోవడమేకాక, శేషేంద్ర కవితా మాధుర్యాలను స్వయంగా తమ రసనలకు అనుభోక్తవ్యం చేసుకోవలసిందని సహృదయులకు ఆవాహన చేస్తున్నాను.

——

అయిదవ ప్రకరణము :

# వర్తమానాంధ్ర కవితలో 'మండేసూర్యుని' ఉన్నిద్రతేజం

మండే సూర్యుడు అనే శేషేంద్ర కవితా సంపుటి 1974లో వచ్చిన తెలుగు కవితాశ్రేణిలో ప్రథమగణ్యమన డంలో నాకేమీ సందేహం లేదు. శ్రీమతి ఇందిరాదేవి ఈ సంపుటికి ఏంతో ఉదాత్త భూమిక సంతరించారు. అందులో ఆమె- "It is his most mature poetic achievement" అన్నారు. ఈ కావ్యాన్ని చదివిన విమర్శకులెవరైనా ఈ వాక్యంతో ఏకీభ వించకుండా ఉండలేరు.

నందితిమ్మన కవీశ్వరు డనినట్లుగా ఇందలి 'మృదుగీతికా పరిణత ధ్వని వైఖరి' పఠిత హృదయతంత్రులను మీటి సహస్ర ప్రకంపనాలతో పిసాళించి ఉత్తమ సారస్వత లక్షణా లన్నిటినీ గర్భీభూతం చేసుకుంది.

అందుకే శ్రీమతి ఇందిరాదేవిగారు ఇలా అన్నారు : 'It has emerged in these poems as the chosen voice of his people'. ఈ సత్యం ప్రతి కవితలోనూ విస్పష్టంగా దర్శనమిస్తుంది.

ఈ కవి వాడిన -చెమట బిందువు. కండల కొండలు, పిడికిలి, ఆక్రోశిస్తున్న అడవులు, వ్రేలాడిన శిరసు, వంతెనలు, వంటి ప్రతీకలు పుంఖాను పుంఖాలుగా మన హృదయంమీద జలపాతంలా విరుచుక పడతాయి. ప్రతి పుటలోనూ విశ్వమంత రహస్యాన్ని ఇముడ్చుకున్న పద చిత్రాలతో ఒక అనుస్యూతగీతికా భోగపదం అలరారుతుంది. ప్రతి శబ్దదళమూ "కాలకంఠుడైన త్రినేత్రుడిన్ని" గళసీమలో మెరుస్తూ వ్రేలాడుతుంది. బుసలుకొట్టే ఫణీంద్రాల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది.

వాస్తవంగా శేషజ్యోత్స్నకి ఈ మండే సూర్యుడు కవితా సంపుటి పొడిగింపేననీ అందులో చోటులేక ఎక్కనివ్వక పోవడంతో బిక్కమొహం వేసుకున్న పద్యాలను ఇందులో ఎక్కించడం జరిగిందనీ శేషేంద్ర చమత్కరించాడు. శేషజ్యోత్స్న కవితా సంపుటిలో ఈ మండే సూర్యుడి బీజాలున్న మాట వాస్తవమే. కాని శేషజ్యోత్స్నలోని కవితలన్నీ మండే సూర్యుడిలో ప్రదర్శితమైన ఈ వినూత్న కవితా ధోరణికి చెందినవి కావు. మండే సూర్యుడిలోని కవితలన్నీ ప్రధానంగా అత్యాధునికమైన imagist and symbolist సంవిధానాలకు చెందినవి. తద్వారా నేడు అంతర్జాతీయంగా ప్రచలిత మవుతున్న కవితా ధోరణిని పుణికి పుచ్చుకున్నవి. ఈ ధోరణికి శేషజ్యోత్స్నలోనే ప్రారంభం జరిగింది. ఇతర భారతీయ భాషలలోకి అనూదితమైన రచనలను ఎంపిక చేయడంవల్ల కాబోలు ఆధునిక కవిత్వ పూర్వరంగానికి చెందిన "మనసే ఒక మధుమాసం" వంటి పాటలు

కూడా చేర్చబడ్డాయి వాటి వైఖరి వేరు. మిగిలిన పడవలు తెరచాపలూ వంటి కవితల వైఖరి వేరు.

ఇక ఈ సంపుటి శీర్షికను నిర్ణయించిన తొలి కవిత మండే సూర్యుడు. దీనినీ కవి 1974 గాంధీ జయంతి సందర్భంగా హైదరాబాదు ఆకాశవాణి ఏర్పాటుచేసిన "దేశం ముందడుగు వేయాలి" అనే కవి సమ్మేళనంలో వినిపించడం జరిగింది. అప్పటి అన్ని కవితలలోనూ విశిష్ట మూర్తిమంతంగా తళతళలాడుతూ ప్రజ్వలించడం ఈ వ్యాసకర్త కనిపెట్టకపోలేదు. ఆ సమ్మేళనంలో సగర్వంగా పాల్గొన్న కొందరు బిరుదుల కొమ్ములు మొలిచిన కవివృషభులు వచనకవిత్వం పేరిట బొత్తిగా అకవిత్వాన్ని వినిపించడం-ఆకాశవాణి వారు గొప్ప కితాబుగా భావించారేమో మనకు తెలియదు. ఆ కవిసమ్మేళనంలో మరో విశేషం ఏమిటంటే కవితారంగంలో బొత్తిగా మీసాలైనా మొలవని బాలకవులు కొందరు అధికారుల అనుగ్రహానికి పాత్రులు కావడమూ జరిగింది. ఏతావాతా అంతమంది పాల్గొన్న ఆ కవి సమ్మేళనంలో కవితాభాసకు పట్టాభిషేకం లభించింది. మూడో నాలుగో అచ్చమైన కవితలు వినే భాగ్యం మాత్రం ఆంధ్ర కవితా రసజ్ఞులకు లభించింది.

ఇంతకీ ఈ "మండే సూర్యుడు" అనే కవితలోని విశిష్టత ఏమిటి ? పదచిత్ర బాహుళ్యంతో ధగధగ లాడటమేనా? ప్రతీక వాద శిల్పంతో పరాంకోటినందుకో గలగడమేనా?— ఈ కవి చెమట బిందువు స్వగతాన్ని ఇతివృత్తంగా ఎన్నుకున్నాడు.

ఆసాంతంస్వాత్మక ధోరణిలో చెమట బిందువు స్వగతంగా ఈ కవిత సాగుతుంది. ఈ చెమటబిందువు ఎలాంటిది? 'కండల కొండల్లో ఉదయించే లోకబంధువు'. లోకబాంధవుడు సూర్యుడని వేరే చెప్పనక్కరలేదు. ఈ సూర్యుడే లేకపోతే ఈ భూమి మీది జీవన సర్వస్వమంతా నిశ్చేతనమవుతుంది. నిర్జీవమవుతుంది. అంతేకాదు. శ్రమైక జీవనానికీ సమస్తవస్తూత్పత్తికీ ఈ చెమట బిందువు ప్రతిష్ఠించబడింది. దీనినుంచే సమస్త భాగ్యభోగ్యాలూ రూపొందుతున్నాయి. అయినా ఈలోకస్తులెవరూ సూర్యశక్తిని పట్టించుకోనట్లే ఈ చెమట బిందువును కూడా ఖాతరు చేయడం లేదు. స్వేదశక్తి పరిగణన పొందడం లేదు. అయినా తనలోక బాంధవత్వాన్ని విస్మరించడం లేదీ చెమటబిందువు. దానికి గుండెలతో దోస్తీ. గుండెలున్న మనుషులు మాత్రమే దాని విలువ గుర్తించగలుగుతారు. చెమట ఉత్పత్తికి కూడా మూల స్థానం మానవ హృదయమే కనక దానికి సమస్త చేతన జగత్తు తోనూ హార్దిక సంబంధం పెంపెసలారుతుంది. అయినా తానుండేది బాధలబస్తీలోనని దానికి తెలుసు. బాధలూ ఇబ్బందులూ దరిద్రాలూ—— ఇళ్ళుగా వాకిళ్ళుగా కళ్ళుగా కల వీధులలో తాను నివసిస్తోంది. 'సింధు వంత చరిత్ర నా పిడికిట్లో ఉన్నా, చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని' అంటోంది చెమట బిందువు. నిజమే ఇదేమీ స్వోత్కర్ష కాదు. దాని మూసిన చిన్న పిడికిలిలో సింధువంత చరిత్ర ఉంది. ఎవడి పిడికెడంత వాడి గుండె ఉంటుందంటారు శరీర శాస్త్రజ్ఞులు. స్వేద సింధువులు ఈ

పుడమిని తడుపుతూనే ఉన్నాయి. మానవజాతి మనుగడ ప్రారంభమయిన తొలిరోజునుంచీ ఈ కృషి సాగుతూనే ఉంది. బంగరు పంటలు పండించడంలో, రాళ్ళు పగలగొట్టి బంగారు పెకిలించడంలో ఈ కృషి ఆవిష్కృతమవుతోంది. ఆ సింధువులను ఈ మండే సూర్యుడు ఎన్ని సార్లు ఆవిర్లుగా మార్చెయ్యలేదు? వర్షాలుగా తిరిగి భూమిపై కురిపించలేదు? అందుకే సింధువంత గొప్ప చరిత్ర ఉంది దానికి. అయినా నిరాడంబరముగా గొప్పలు ప్రగల్భాలు లేకుండా తరతరాలుగా మనిషిని చెక్కుతూనే ఉన్నాడీ శిల్పి. శ్రమ జీవన వికాసంలోంచే ఆటవిక మానవుడు నాగరికుడవుతున్నాడని ధ్వని. శిల్పి అనడం శ్రమజీవని సౌందర్యానికి కవి కల్పించిన బాహ్య విష్కారం (Manifestation).

కండల కొండల్లో నిత్యం ఉదయించే లోకబాంధవుడయిన చెమట బిందువనే ఈ శిల్పి ఎలాంటి వాడు? చేవగల చిక్కటి నక్షత్రాల నెన్నిటినో తనతో సహా కలుపుకొన్నాడు. సూర్యుని లాగే నక్షత్రాలు కూడ అజరామరంగా స్వయం ప్రకాశంగా వెలిగే గోళాలు. వాటి సహకారంతో సమష్టిగా లోకంలోని చీకటిని ఆస్వాదిస్తున్నాడు. అయితే ఇది ఎక్కడ? వెళ్ళిన పక్షుల గుంపులు వెనక్కి రాలేదని ఆక్రోశిస్తున్న అడవుల్లో, వెళ్ళిన పక్షుల గుంపులు మామూలు పక్షుల గుంపులుకావు. రహస్య విప్లవకారులై అడవుల గుండెల్లో దాగుంటున్న వాళ్ళు కావచ్చు. వాళ్ళకి అడవులే తల్లులు. వాళ్ళు వెళ్ళారు. ఇంకా తిరిగి రాలేదు. అందుకని అరణ్యాలు ఆక్రోశిస్తున్నాయి.

అలాంటి అడవుల్లో ఈ స్వేదబిందు సూర్యుడు చీకట్లను తాగే స్తాడు. మానవుని సంస్కారం స్మృతిమీదనే ఆధారపడి ఉంది అదే మనిషిని జంతువు నుంచి విడదీస్తోంది. కళల్నీ గానాన్నీ, చరిత్రనీ ప్రసవిస్తోంది. అది కాంతా సమ్మితం. కనుక స్మృతు లతో నేసినపైట చెరుగు పట్టుకొని చెమటబిందువు దేశం పాదా లను పెనవేసి కొంటోంది. శిరస్సునీ హృదయాన్నీ చెమట లెరుగని మహాభోగు లాక్రమించు కున్నారు. తనకు మిగిలింది పాదాలే!

ఆక్రోశిస్తున్న అడవుల శోకభారాన్ని ప్రదర్శించిన ఈ పదచిత్రాలలో కవి స్పష్టంగా ప్రదర్శించిన భావచిత్రం మరొక టుంది. కీకారణ్యాలవలె అల్లిబిల్లిగా పెరిగిపోయి ఉన్న కార్మి కుల బస్తీలను కూడా ద్యోతకం చేస్తాయి. వారు పనులకువెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. ఆ ఆక్రోశంతో సతీసుతులు విలాపాలు వినిపిస్తున్నారు. అదే రూఢ్యర్థమైతే తర్వాత వచ్చే పదచిత్రా లకు అవసరముండదు. అవి- 'చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తు న్నాయి కొమ్మల్లో పూవులై.' గత చరిత్ర కన్నీళ్ళతోనూ రక్తంతోనూ తడసి పోయింది. చెట్లకుకట్టి ఎందరో్ని అధికారం ఉరితీసింది. అలాంటి శిరసులు మళ్ళీ ఎర్రగా పూస్తున్నాయి. చైతన్యం మరణించదు కనుక.

ఈ చెమట బిందువు సహస్రరూపాలుగా సాక్షాత్క రించింది కవికి. స్వాత్మకాభివ్యక్తితో సాగినా ఇందలి ఇతి

వృత్తం పరాత్మక సత్యమే. శ్రమ జీవనుల సౌభాగ్యంకోసం ఎన్నో జీవితాలు ఆత్మార్పణం కావించాయి. జీవన పోరాటంలో కొన్ని శిరస్సులు తిరిగి తిరిగి పూస్తూనే ఉన్నాయి. గుండెలలో తుపాకీ గుళ్ళు దూరి కొన్ని నేలకొరిగాయి. ఆ గోళీ దూరిన గుండెలు ఇప్పుడిప్పుడే కదల నారంభించాయి. గుడిలోని జయ ఘంటలై మ్రోగుతున్నాయి. ఎందరో ఎన్నో రాత్రుల రక్తాన్ని పిండి ఒకానొక శుభదినం కోసం సమర్పించారు. అలాంటి త్యాగధనుల హృదయాలు మన పంచలలో మంచు బిందువులలా వ్రేలాడు తున్నాయి. మన స్మృతులను వెలిగి స్తున్నాయి.

చెమట బిందువు తన స్వగతంలో తనశక్తి యుక్తుల్ని వివరించింది. కర్తవ్యాన్ని ప్రబోధించింది. తనది ఇనుప పిడికిలి. కాల హృదయం కఠిన శిలా సదృశంగా కర్కశంగా ఉంది. కాంతిజ్వాలల్ని ఎవరికీ అందనీయకుండా దాచేసు కొంటోంది. అలాంటి వాటికోసం సాహసోపేతంగా అవసరమయితే సాయుధహస్తంతో తాను తవ్వి పైకి తీస్తుంది. అహింసా మంత్రజపం వల్లిస్తూ నాగేటి కర్రుతో దున్ని పుడమిని గాయపరచడం హింసాయుత చర్య అనుకొని నిశ్చేతనుడయ్యే కృషికునికి సత్ఫలితాలందవు. శిలాహృదయంలో కాంతిఖని దాగి ఉన్నపుడు దాని కార్కశ్యాన్ని భేదించి త్రవ్వి తీయక తప్పదు. ఆపని జరగకుండా శతాబ్దాలు నిద్రపోయాయి.నిశ్శబ్దంగా అసమ్మతిని ప్రకటించాయి

ఆసమయం ఆసన్నమయిందని ధ్వని. Hint and Suggestion ప్రకటించాయి. ఆ సుప్త శతాబ్దాలకు నిప్పంటించక తప్పదు. ఏ ఉత్తమ కవితకయినా ప్రాణకాంతులే. అట్టికాంతులతో ఈ కవిత దేదీప్యమానంగా సాగింది.

చెమట బిందువు శ్రమశక్తికీ సృజనశక్తికీ ప్రతీక. కనుక తాను సంఘీభావంతో ఏఘనకార్యాన్నయినా చేయగలదు. జగత్తు రూపురేఖల్ని సమగ్రంగా మార్చివేయగలదు.ఇంతవరకూ నదులు సముద్రాలవైపుగా పరిగెట్టడమే చూస్తున్నాము. తమతీయని తోయాలతో ఉప్పునీటి ఉదధుల్ని నింపి నిరుపయోగమే కావడం చూస్తున్నాము. అంతేగాని భూహృదయాన్ని సశ్యశ్యామలం చేయడానికి ఉపకరించడంలేదు.తమజీవనాల్ని సార్థక్యం చేసుకోవడంలేదు. కనుకనే పూర్వకవులు పాపం నదులకూ సముద్రానికీ సతీపతుల సంబంధాన్ని కవిసమయంగా స్థిరపరిచారు. తెనాలి రామకృష్ణకవి "గంగా సంగమ మిచ్చగించునె. మదిన్ కావేరి దేవేరిగా అంగీ కారమొనర్చునే, యమునతో ఆనందమున్ చెందునే?" అంటూ పిష్టపేషణంగా తనకు పూర్వమే స్థిరపడి ఉన్న కవిసమయాన్ని పునఃప్రతిష్ట చేశాడు. ఇక్కడ ఈ కవి ఆ పాత కవిసమయాన్ని స్పర్శిస్తూనే ఆ సంప్రదాయాన్నీ రద్దు చేస్తున్నాడు. సముద్రానికీ నదులకీ గతానుగతికంగా సాగుతూన్న ఈ దుష్ట సంబంధాన్ని పరిహరించ బూనుకున్నాడు. కనుకనే ఇలాఅంటున్నాడు: 'సముద్రాల విరహంతో పరుగులెత్తే

నదుల్ని ఆగండని కేక వేస్తాను.' ఈకేక ఒట్టి పొలి కేక కాదు. ఒకనియంత శాసనం! అనుల్లంఘనీయమైన ఆజ్ఞ. దీనితో నదులు చచ్చినట్లు ఆగి తీరవలసిందే! దీనికి అనుబంధంగా మరో ఆజ్ఞను ఇలా జారీచేస్తాడు! 'ఆ రంగులేని బంజర్లకు ఆకుపచ్చ పులమండి' అని. ఆ నదులు వెళ్ళి బంజర్లకు ఆకుపచ్చ రంగులు వేస్తాయి. అప్పుడు — దేశంనుంచి పారిపోయిన నవ్వుని తిరిగి రమ్మని ఆహ్వానిస్తా —అంటాడు కవి చెమటబిందువు గొంతుతో. సకల దరిద్రాధీనమైన ఈదేశంనుంచి సుహాసచంద్రికలు ఎప్పుడో పరారి అయిపోయాయి. భవిష్యత్తులో పుష్కలంగా అలంక రించ వస్తాయి. పువ్వులే కన్పించని ఎడారిలా దేశంమారి పోయింది. దిక్కులేక సీతాకోకచిలుకలు ఒక్కపువ్వు కోసం ఆమ డలదూరం తిరుగుతున్నాయి. వెతుక్కుంటున్నాయి ఇక ముందా ఇబ్బందిలేదు, 'పువ్వుకోసం వెతుకుంటున్న సీతాకోక చిలుక్కి ఒక పూలతోట ఇస్తాడు' కవి. ఇకముందు పిల్లలు ఆనం దానికి మారుపేర్లుగా ఉంటారు, తిండిలేక ఊదపొట్టలతో ఊచ కాళ్ళతో ఎండిపోయి పరమ అసహ్యంగా చిప్పలతో సాక్షాత్క రించే పిల్లలు కులాసాగా రాజభోగాలు ఆరగిస్తారు. రాత్రిని ముక్కలుగా కోసుకుని వెన్నెలలో ముంచుకొని కొరుక్కుంటూ తినమని పిల్లలకి విందు పర్పాటు చేస్తాడు, రొట్టెముక్కల్ని జామ్‌లో నంచుకుంటూ తిన్నట్లు.

ఇంతవరకూ ఈకవిత అత్యంత మనోహరంగా సాగింది. చదువరికే సందేహామూ కలిగించదు. బొమ్మ తరవాత బొమ్మగా

పాఠక హృదయంలో చక్కని పదచిత్ర సమాహారం సాగిపో తుంది. ఆతరవాతనే రచయితకీ రచనకీ ఒకపేచీ ఏర్పడింది. అది–'సూర్యుడు ఈ శుభదినాన్ని మోసం చెయ్య నివ్వను!'అన్న చోట. ఇదిఒక కవితా వాక్యంగా, రమణీయంగానే ఉంది. కాని పూర్వకవితా రంగానికీ దీనిప్రాదుర్భావానికీ ఒక సమన్వయం (Congruence) సంధించబడలేదు. కారణమేమంటే – చెమట బిందువు ఆరంభంలో తానే లోకబంధువునని చెప్పుకుంటుంది. మండే సూర్యుని లక్షణాల్ని ఆపాదించు కుంటుంది. అలాంట ప్పుడు ఆసూర్యుడు ఈశుభదినాన్ని మోసం చేయడానికి పూను కోడు. అలా పూనుకునే దుశ్శక్తులింకా చాలా ఉన్నాయి. మేఘుడు కావచ్చు; రాహుకేతువులు కావచ్చు; మరేమయినా కావచ్చు. తానే తనశుభదినాన్ని మోసం చేయడమనే సమస్యకి తావు లేదు.

ఒక ప్రతీకను నెలకొల్పి ప్రథమ పురుషలో దాని పరంగా కవితను వెలార్చే ధ్యానంలో సాధారణంగా కవులకీ తమ ప్రతీకలకీ మధ్య ఇలాంటి పేచీలు రావడం సహజమే. కవి స్వీయ వ్యక్తిత్వం పట్టుతప్పి కవితలోకి అసంయమితంగా ప్రవేశిస్తుంది. దీనితో స్వాత్మకతకీ పరాత్మకతకీ మధ్య ఉండే పల్చనిపొర చిరిగిపోతూ ఉంటుంది. తన పర విభేదాన్ని విస్మ రించే తాదాత్మ్య స్థితిఏర్పడుతూ ఉంటుంది. అప్పుడిలాంటి తిక మకలు ఏర్పడుతూ ఉంటాయి. సాధారణమే అయినంత

మాత్రంలో దోషం దోషం కాకుండాపోదు. కవి స్వీయదర్శనం ప్రతీకను దురాక్రమించి ఆరోపితం కావడం రస భంగమే.

'సూర్యుడు ఉదయించక పోతే
మండే నాగుండె చీల్చి దానిమీద పెడతా'

అన్నవాక్యం పూర్వ వాక్యాన్ని అనుసరించి ఉద్భూతమయింది. కాని ఈ వాక్యం యథాతథంగా ఏమీ బాధకం కావడం లేదు. అసలు సూర్యుడు కాంతి విహీనుడయితే ప్రజ్వలించే తనగుండెనే చీల్చి సూర్యుడి స్థానంలో నెలకొల్పుతా నంటుంది చెమట బిందువు. అలా వ్యాఖ్యానించు కోవడం రస పోషకమే.

'ఎర్రటి నాకండలతో ఎండలు కాయిస్తా' అన్నవాక్యంతో ఈ కవిత పరాకాష్టకు చేరుకుంటుంది. ఈముగింపు వాక్యంతోనే 'మండే సూర్యుడు'అనే కావ్య నామం సార్థక్యత పొందుతుంది.

అయితే ఈ కవితలోని విశిష్టత ఏమిటి? ఇంతవరకూ ప్రతి భాషలోని కవిత్వంలోనూ ఆధునిక కాలంలో సయితం ఒక నైసర్గిక ఆధారభూమి ఏర్పడి ఉంది. కేవలం పదాల పోహళింపు ద్వారా శబ్దశక్తిపై ఆధారపడిన సౌందర్యానికి కవితాశిల్పం కాణాచిగా రూపొందింది. ఇక్కడ ఈలక్షణానికి మారుగా పద చిత్రరచన ప్రాధాన్యం వహించింది. ప్రతీకలు ధారాళంగా నెల కొల్ప బడ్డాయి. వినూత్నసంవిధానం ద్వారా ప్రతీవాక్యమూ ఒక మనోహర భావచిత్రంగా (Ideogram) రూపొందింది ఒక సమగ్ర తేజశ్శక్తిని స్వాయత్తం చేసుకుంది. ఈకారణం వల్లనే

ఈగ్రంథ పీఠికలో శ్రీమతి ఇందిరాదేవి చెప్పిన ఈక్రింది వాక్యాలు ఎంతో సమర్థవంతంగా ఉన్నాయి: "Man Situated any where on the globe can share with him (the poet) the fruits of his thinking unlike in the case of poets who cling to the borders of mere language"

ఈ విషయం పాఠకుడి హృదయానికి మరింత గాఢంగా హత్తుకోవాలంటే, ఈశతాబ్దిలో మన భాష సాధించిన మహోత్తమ కవితలలో ప్రముఖమైనదైన శ్రీ శ్రీ 'కవితా! ఓ కవితా!' ను చదివి ఈ మండే సూర్యుడును చదవమని సలహా ఇస్తాను. అప్పుడు పాఠక హృదయం పై సత్యాన్ని సునాయసంగా బేరీజు వేసుకో గలుగుతుంది.

ఏ భాషలో పుట్టిన కవిత ఆభాషా సంబంధి నిసర్గ సౌందర్య భూమికలతో పుడుతుంది. శాబ్దిక మాధుర్యాలను కొల్లగొట్ట కుండా ప్రభవించడం సాధ్యంకాదు. ఆజన్మ బంధాలను జాగ్రత్తగా అధిగమించి, ఆసౌందర్యాల స్థానంలో సార్వజనీనమైన ప్రతీకలను పదచిత్రాలను కల్పించి, విజయం సాధించ గలగడం సామాన్య విషయంకాదు. దీనికి వర్తమానకాలంలో పుష్పించుతూన్న ఆధునిక ప్రపంచ కవితా సమాహారాన్ని కుశలంగా అధ్యయనం చేయడమే మార్గం. ఈ కవితా సాధనలో శేషేంద్ర సిద్ధిపొందాడు. అతని విజయాలను పరిశీలిస్తుంటే మన కాలంలోని మహా విమర్శకుడు సర్ హెర్బర్ట్ రీడ్ అన్న ఒక గొప్పమాట గుర్తుకు వస్తోంది: "Poetry is transcendental

Quality and we can no more define this Quality than we can define a state of grace!" అన్న సూక్తి బహుధామనన శీలమే.

మండే సూర్యుడు అనే ఈ కవితా సంపుటిలోని కవితలన్నిటికీ శేషేంద్ర స్వయంగా ఆంగ్లానువాదాన్ని సంతరించాడు. ప్రతి పుటలోనూ అధోజ్ఞాపికలుగా ప్రచురించాడు. ఉభయ భాషల కవిత్వాలతోనూ గాఢ పరిచయమున్నవారికి, మూలంలో దిఙ్మాత్రంగా ధ్వనింపబడిన కొన్ని భావాలు వివరణ పొందడమూ కనిపిస్తుంది. తద్వారా కవితావగాహన మరింత అనుభవ పూర్వకమవుతుంది.

చెమట బిందువు స్వగతాన్ని కవి చెబుతున్నాడన్నది ఆంగ్లానువాదం చదివితే మరింత సుబోధకమవుతుంది. అనువాదం సరళ సుందరంగా ఉంది. హృద్యంగా సాగింది ఎక్కడా మూలాధీనతకు లోపం రా నీయలేదు. పైగా ఆంగ్లభాషలో సాధింపబడిన కవితానుకూల అభివ్యక్తులు సాధికారంగా ఉపయుక్త మయ్యాయి.

"నేను చెమట బిందువుని
కండలకొండల్లో ఉదయించిన లోకబిందువుని"
అన్న తెలుగు కవితా వాక్యానికి ఆంగ్లంలో—

I am the drop of sweat, I am the sun
Rising from the hills of human sinews'

అంటూ అనువాదం సాగడం ఎంతకళాత్మకమో వేరే వివరించ నవసరంలేదు. స్థూల దృష్టికి మూలంగాని అనువాదంగాని వచనం లాగే కనిపిస్తుంది. కాని లోగొంతులో చదువుతునపుడు మాత్రం వచనంలా పొడిపొడిగా సాగనివ్వని శిల్పబంధం ద్యోతక మవుతుంది. ఒక అంతర్లయ మన హృదయాన్ని చప్పున లోబరుచు కుంటుంది. ఎలిజబత్ డ్రూ అనే విమర్శక విదుషీమణి చెప్పిన మాటలు నిజమే అనిపిస్తుంది. "The one thing that will defferentiate verse from prose is an experience with ear: poetry is rhythmically patterned language".

— —

ఆరవ ప్రకరణము :

# 'మండేసూర్యుడి' శక్తిమంతమైన ధ్వనివల్ల తెలుగు నేలమీద అశేష ప్రకంపనాలు

మానవ భాషలన్నీ సహజంగా రూపకాలంకార సమన్వితాలే. దైనిక జీవితంలో ఉపయుక్తమయ్యే సాధారణ భాష నిండా రూపకాలు ఉంటూనే ఉంటాయి. అయితే అవి మన చెవులకు అలవాటయిపోయి రూపకాలన్న స్పృహలేకుండా పోతుంది. ఈవాక్యాలు ఒక్క సారి పరిశీలించండి - ఎండ మండి పోతోంది; కోపంతో భగ్గుమన్నాడు; చటుక్కున ఆలోచన మెరిసింది. రోజులు దొర్లి పోతున్నాయి. బత్తాయితొనలో ముత్యాలు; బాధల్లో మునిగి పోయాడు; వంటివి ఎన్నయినా పేర్కొవచ్చు. ప్రతి భాషలోనూ సామాన్య సంభాషణల నిండా ఇలాంటి వెన్నో తరచుగా కనిపిస్తాయి. కాని అవి నిత్యం అలవాటైపోవడంవల్ల చప్పున వాటిలో ఒక కవితా సౌందర్యం ఉన్నదన్న స్పృహ కలగదు. ఇలాంటి వాక్యాలలో క్రియలద్వారా సాధించినవి, విశేషణాలద్వారా సాధించినవి, విశేష్యాలనే ప్రతీకలుగా వాడినవి ఎన్నో చక్కని రూపకాలు మన మనస్సు కెక్కకుండానే సాగి

పోతాయి. పరిపాటిగా జారిపోతాయి. అతిపరచయాదవజ్ఞ అన్న సామెతగా తయారవుతుంది మనుషుల గ్రహణశక్తి.

కాని కవి దర్శన ఎప్పుడూ ఏవిషయాన్ని వివరించడానికి ఏ విషయంతో సమాన ఆంతరిక బహిస్సంబంధంఉందో గవే షిస్తూ నే ఉంటుంది. ఒక అనుభూతిని ఒక పదచిత్రంతో ముడి పెట్టి అనుభవైకవేద్యంగా మారుస్తుంది. తద్వారా భావం కొంత సాగతీయ బడవచ్చు. అయితేనేం పాఠకుని అనుభూతికి తద్వారా సాంద్రత కలుగుతుంది. వర్ణనీయ వస్తువుకు గాఢ రేఖలు సంతరించ బడతాయి.

ఈ క్రమ వికసనం కవి మనసులో దాదాపు యాదృచ్ఛి కంగానే జరుగుతుంది. అయితే ఇది ఎలా సాధ్యం? కవి ఎప్పుడూ లోకాన్ని ఒక విలక్షణమైన దృష్టితో చూస్తూ ఉంటాడు. ఆ పరిశీలనలో అతని హృదయానికి నిరంతరం భావాలు స్వప్నాలవలె కవికి రక్తసంబంధమున్న భాషలోనే తీగలు సాగుతాయి. కవికి కలిగే భావాలు పదచిత్రాల ద్వారా భావ చిత్రాల ద్వారా స్థిరమూర్తులు దాలుస్తాయి. వాటిని కవి అంతశ్చైతన్యం తన రహస్య భాండారంలో గుప్త పరుచు కుంటుంది. ఈ క్రియాశీలత అనభివ్యంజనంగా అతని మనో పరికరం సదా ప్రచలితం చేస్తూనే ఉంటుంది. అట్టి కవి ఒక కావ్యరచనా వ్యగ్రతతో సమాధిపరుడైనపుడు ఈ అంతశ్చై తన్యం తనస్మృతి మాలికల నుంచి ఒక్కొక్క పువ్వునే ఏరి

సమయోచితంగా అందిస్తూ ఉంటుంది. అతని సుప్త చేతనలో గుప్తమైన పదచిత్రాలలో రూపానుబంధాలు (affiliations) ఉంటాయి. భావనాస్వరూపారోపణలు (associations) ఉంటాయి. అంతస్తత్వ వాసనా సంలీనతలు (alliances) వంటివి ఉంటాయి. కనుకనే కాలరిడ్జ్ మహాశయుడు ఒక మంచిమాట చెప్పాడు: ఈ వాసనాభరిత మనోలోకం ఒక ద్రవరూపంలో ప్రవహిస్తూ ఉంటుంది. కనుకనే సాధారణంగా మౌనిలా ఉండే వక్తే కవితారచనకు పూనుకున్నపుడు అతని హృదయాన్ని ఒక వినూత్న శక్తి ఆవేశిస్తుంది. ఈ పూనకాన్నే Intuition అంటారు. సామాన్యంగా మాటలు పెగలక నిస్సత్తువగా కనిపించే వ్యక్తికి సైతం ఈపూనకం తనకే ఆశ్చర్యం కలిగించే హృదయశక్తి నావిష్కరిస్తుంది మనో మందిరంలో విడి విడిగా గుప్తం చేయబడిన వాసనలకు సైతం ఒక అనుస్యూత అంతస్సూత్రం ఏర్పడుతుంది. ఈ సమన్వయత లోంచే అనంత కవితా తేజస్సు పొటమరిస్తుంది. ఇదే పద చిత్ర నిర్మాణ శక్తిగా ఆధునిక కవితకు అమూల్యార్థాలను సంతరిస్తోంది.

కవి వాక్కునుండి వెల్లువలుగా ఉరికి పడే పదచిత్రాలు మనసు లోపలి పొరలలో గుప్తంగా ఉన్నపుడు బింబరూపా లుగా మాత్రమే ఉంటాయి. అవి అందరికీ పరిచయమైన స్వరూ పాలు తొడుగుకొని అభివ్యక్తమైన స్థితిలోనే పద చిత్రాలుగా

రూపొందుతాయి. ఈ పదచిత్ర విన్యాస శక్తే కవితా శక్తిగా వ్యంజనా శక్తిగా కీర్తించ బడుతోంది.

రూపకమే కవిత్వానికి ప్రాణధాతువని ఆరిస్టాటిలో ఆనందవర్ధనుడో ఎప్పుడో చెప్పారని మాత్రమే కాదు. కవి-కేవలం భాషా పరికరం మాత్రమే కల చిత్రకారుడు. కనుక ఇది స్వతస్సిద్ధంగా ఏర్పడే ధర్మమే! అయితే ప్రాచీనుల రూపకానికీ, ఆధునికుల పద చిత్రానికీ సంబంధమున్నట్లే కనిపిస్తుంది, కానీ వైరుధ్యమే హెచ్చు. ఆధునిక కవితా కళాకారులు ఘనీభవించిన సంప్రదాయపు ఉపరితలాన్ని ధ్వంసించుకుంటూ లోలోతులకు పోతారు. తద్వారా సమకాలీన జగద్వాణితో తమ కవితా కంఠాన్ని మేళవిస్తారు ఈ కవితా శక్తి మాత్రం - ఆలంకారికులో, లాక్షణికులో నేర్పగలిగేది కాదు. కవి తానుగా సాధించి తెచ్చుకునే సహజశక్తి; అందుకే మనవాళ్ళు 'కవి ద్రష్టకావాలనీ - నానృషిః కురుతే కావ్యమనీ' మొత్తుకుంటూ ఉంటారు.

ఈ Intuitive perception అనే శక్తితో సామాన్య విషయాలలోంచే అసామాన్య ధర్మాలను నిజమైన కవి దర్శించ గలుగుతాడు. కవి కల్పించిన రూపకాలో, ఉపమలో, పద చిత్రాలో తర్కానికి అర్థరహితంగా కనిపించవచ్చు. కారణ మేమంటే తార్కికబుద్ధి ఎప్పుడూ విశ్లేషణారీతిలో సాగుతుంది. బాహ్య విషయాలలోని అనుబంధాలను, అంతస్సూత్రాలనూ

వింగడించడమే దాని కర్తవ్యం. కవి మనోధర్మం అదికాదు. అతని ఆర్ద్రహృదయం బాహ్యవస్తువుల అంతర్గత సమగ్రతను గ్రహించగలుగుతుంది. సామ్యధర్మాలను స్పర్శించగలుగుతుంది. బాహ్యదృష్టికి విడివిడిగా కనిపించేవాటి అంతర్నిబద్ధతను అనుసంధించగలుగుతుంది. అందుకే సెసిల్ డే లెవిస్ ఇలా అనవలసివచ్చింది.

Let logicians analyse the hive
Our concern is with the honey.

అలాంటి కవితా మధువును తనివితీరా గ్రోలదలిచిన ఆధునిక కవితా ప్రియులకు ఈ మండే సూర్యుడులో ప్రదర్శితమైన శేషేంద్రజాలం అపార సంతృప్తినిస్తుంది. కేవలం సంతృప్తినేకాదు...పారవశ్యాన్నే కలిగిస్తుంది. ఈ మండేసూర్యుడు సహస్రముఖాలుగా దర్శనమిస్తాడు. శ్రమైక జీవన సౌందర్యానికి ప్రతీకగా నిలుస్తాడు. శ్రామిక జన విప్లవ జనసందోహానికి ప్రతినిధిగా దర్శనమిస్తాడు. పీడితజనముఖరేఖలలో విజృంభించే విస్ఫులింగాలకు మూర్తీభావంగా సాక్షాత్కరిస్తాడు. ఇలా ఈ మండే సూర్యునికి బహురూపాలు.

ఈ కవితా సంపుటి పాఠక హృదయంలో సహస్ర యోచనా కిరణాలను ప్రసరిస్తుంది. ఈ కావ్యాన్ని ఆసాంతం చదివి ముగించిన రసజ్ఞునికి మానసికంగా విచిత్రానుభూతి కలుగుతుంది. ఏదో కడుపులో తిప్పుతున్నట్లు, ఒడలు జోగు

తున్నట్లూ అశాంతి కదలబారుతుంది. నిండుభోజనంలో మొహ మాటపడి తిని భుక్తాయాసమనుభవిస్తున్నట్లు ఒక ఊపు ప్రారంభ మవుతుంది. తనలోంచి తనకే తెలియని రీతిగా ఒక నూత్న మానవుడు-మృత సంజీవనీ మంత్రాన్ని నేర్చుకున్నవాడు, ఆవిర్భవిస్తున్నట్లుగా ఒక వాంఛనీయ విపత్తు ఆసన్నమవుతుంది. ఉత్తమ కవితను అనుభవిస్తున్నపుడు కలగవలసిన పారవశ్యస్థితి అంటే ఇదే! దీన్ని మండే సూర్యుడు మనకు అపారంగా లభింపచేస్తుంది.

ఉత్తమ కవిత్వాన్ని అనుభవిస్తున్నామనుకునే కొందరు అల్పబుద్ధులు కవితాభివ్యక్తిలో ఉపయుక్తమయ్యే మాటల గారడీతోనే ఆగిపోతారు. సమాసాల మసాలాపటాటో పంపైనా దాని అర్థరహితమైన గలగల చప్పుళ్లపైనా తమ బుద్ధిని కేంద్రీకరిస్తారు. అలాంటివారికి ఆ పదాలవెనుక ఏమ యినా ఉత్తమ భావన ఉన్నదో లేదో రవ్వంతయినా విచికిత్స పొడగట్టదు. అలాంటి బుద్ధిమంతులీకావ్యంజోలికి రాకపోవడమే మేలు.

కారణమేమంటే మండే సూర్యుడులోని కవితలలో ఎక్కడా సమాసాల ఆర్భాటం కనిపించదు. శబ్దాలవెర్రి మోత వినిపించదు. ఒకే నిడివిగల మాటల పేర్పుడు ద్వారా సాధించే నేలబారు శాబ్దిక సౌందర్యం కనిపించదు. కేవలం అల్ప మైన, అతిసామాన్యమైన పదాలద్వారా అనల్పమైన, అసామాన్య

మైన భావసాంద్రతను ఈ కవి సాధిస్తాడు. నిబిడీకృత పదచిత్ర శోభను వెలారుస్తాడు.

కవిత్వంలోని శబ్దమాధుర్యాన్ని, శయ్యాసారళ్యతనీ మాత్రమే అనుభవించగలిగే సామాన్యులు పైపైమెరుగు సంగీత ధ్వనినితప్ప లోపలి గుణాన్ని అందుకోలేరని ఈ క్రింది కవితలో అలెగ్జాండర్ పోప్ చాలా చమత్కారంగా అన్నాడు, అతడు ప్రాచీనుడయితేనేం, భవిష్యద్దర్శనుడు. అతనేమన్నాడో పరిశీలించండి.

In the bright Muse, though thousand charms
Conspire,
Her voice is all these tunefull fools admire,
Who haunt Parnassus but to please their ear.
Not mend their minds, as some to Church repair
Not for the doctrine, but the music there :

దెయ్యంతిన్న కొబ్బరికాయలవంటి పదాల మధురవచో గుంఫన సుప్రసాదంతో తృప్తిపడి ఇదే ఉత్తమ కవిత్వమని భ్రమ పడేవాళ్ళు కవితా సంబోధన కలిగించే బహువిధార్థ తాత్పర్యాల జోలికిపోరు. ఈ తప్పు కేవలం సామాన్యపాఠకులది మాత్రమేకాదు. కవితా శ్రోతలలో అలాంటి భ్రమాస్పద పరిస్థితిని కల్పించిన కవులే నిందార్హులు. ఇలా నేననడానికి ప్రబలమైన ధైర్యాన్ని మహనీయుడు నీలకంఠ దీక్షితులవారు ఇలా కలిగిస్తున్నారు.

"మత్వాం పదగ్రంథనమేవ కావ్యమ్
మందాః స్వయంతావతి చేష్టమానాః
మద్యంతి బాలా ఇవ పాణిపాద,

ప్రస్పంద మాత్రమ్ ప్లవనం విదంతః" అని అలాంటి భాషాభేషజం జోలికి ఈ మండే సూర్యుడు ఎక్కడాపోడు.

''రాత్రి నేను కనే కలలు
దినాలమీద కట్టే వంతెనలు
నాభాష తననిండా బాధలు నింపుకుంది.
చీకట్ల లాస్యం
ఛేదించుకుని
చుక్కలు నా వాక్యాలై
సూర్యుడులో కలిసిపోతున్న
చిట్టచివరి రాత్రి
................
రోజూ ఉదయాద్రి శిఖరంమీద
రక్తకాంతులుచిందే గుండ్రని పాటని !

అంటాడీకవి తనను గురించి తాను చెప్పుకుంటూ ఇందలి నేను స్వీయ వ్యక్తిత్వానికి చిహ్నమేకాని వ్యక్తిగత అహానికి మాత్రం సంకేతంకాదు. ఇందులో ప్రథమపురుషైక వచనం ఎక్కడ ప్రయుక్తమయినా అది సామాజిక అహానికి పతీకగా మాత్రమే ప్రతిష్ఠితమైంది. క్రిస్టఫర్ కాడ్వెల్ చెప్పిన

ఈ సామాజిక అహమే (Social ego) ఈ కవితలకు జీవన ధాతువులై అదే పాఠక హృదయానికి తనస్వీయ కంఠధ్వనిగా ప్రమేయం కలిగిస్తుంది. ఈ సందర్భంలో కీట్సుకవి చెప్పిన వాక్యంకూడా మన అవగాహనకు దోహదం చేస్తుంది. "Poetry should strike the reader as a wording of his own highest thought, and appear almost rememberance" సరిగ్గా అలాంటి భావాన్నే ఈ మండే సూర్యుడు లోని కవితలు పాఠకుల అనుభూతులకు కలిగిస్తాయి. ఇందలి ముప్పైఆరు కవితలలోనూ దేన్ని స్పర్శించినా ఇదే సత్యం ప్రత్యక్షమవుతుంది.

పైన ఉల్లేఖించిన 'నేను' అనే కవితను ఒక్కసారి పరిశీలిద్దాం. ప్రతిరాత్రి మనోహరమైన కలతో గడుస్తుంది. యదార్థ జీవిత యదార్థాలను స్పష్టంగా ప్రదర్శించే పగలుకంటే ఆ విధంగా రాత్రే నయమనిపిస్తుంది. పగలంతా వేదనాభరిత హృదయం ఎప్పుడు రాత్రి అవుతుందా, ఎప్పుడు కలలోనయినా కనీసం తేలిపోగలమా, అని ఎదురుచూస్తుంది. కనక గతరాత్రి కవి కనిన కలలను వర్తమానదివసంపై వంతెనలుగా నిర్మించి తిరిగి రాత్రిలోకి ప్రయాణం సాగిస్తానంటాడు. పైగా కవి భాష తననిండా బాధల్ని నింపుకుంది. దట్టంగా వ్యాపించిన చీకట్లు లాస్యంచేస్తున్నాయి. చుక్కల చిరువెలుతురులను రక్కేస్తు న్నాయి. అట్టి చీకట్లను ఛేదించుకుంటున్నాయి అతని కవితా వాక్యాలు, అవి సూర్యుడి వెలుగులో లీనమవుతున్నాయి. అవి

చుక్కలు, వాక్యాలనడుమ ఫుల్ స్టాపులుగా, వాక్యాల ప్రవాహా శీలతకి నిరోధాలవుతున్నాయికూడా. ఆ నిరోధాన్ని ఉపసంహా రించుకుని సూర్యుని కిరణాలవంటి కవితావాక్యాలలో తమ వెలుతురును లీనం చేస్తున్నాయి. కలిసిపోవడాని చిట్టచివరి సారిగా ఉద్యమించిన చివరి రాత్రిని తానే అంటాడు కవి. అంతేకాదు ప్రతిదినారంభంలోనూ ఉదయాద్రి శిఖరంమీద రక్త కాంతులు చిందే గుంద్రని పాటకూడా తానే. అరుణోదయ ప్రభా మండలంగా తన పాటే రూపుదాల్చి, వేకువ తూర్పుముఖాన సాక్షాత్కరిస్తుంది. ఎంతగొప్ప ఊహ! తనపాట ఒక విశాల ఆవృత్తాన్ని నిర్మిస్తుంది. శతకోటి ప్రకంపన తరంగాలు కలి గిస్తుంది. కిరణజ్వాలలతో జడజీవితంపై చైతన్యం వెలారిస్తుంది. ఇంతభావాన్నీ కవితాహ్రస్వలిపిలో 'గుంద్రని పాట' అన్న ప్రతీకద్వారా సామాన్యమైన భాషకే వినూత్న శక్తిని ప్రతి పాదించి ప్రయోగించాడు శేషేంద్ర. ఇదీ ఉత్తమ కవితా ధర్మం. ఇందలి ప్రతి కవితలోనూ ఆ శక్తి ద్యోతకమవుతుంది.

ఫ్రెంచి మహాకవి 'గిల్లేమీ ఎపోలెనీర్' కవితగురించి వ్యాఖ్యానిస్తూ—సి. ఎమ్. బౌరా ఇలా అంటాడు : He had a mature and critical mind, but in hisapproach to experience, he had the gift of perpetual boyhood The combination unusual and explains much in his worth" (See page: 67. Creative Experiment) సరిగ్గా యిదే వాక్యం క్రియాపదాల కాలాన్ని మార్చి చదివితే

శేషేంద్ర కవితా ధర్మాలను పట్టిచూపుతుంది. అతని భావుకత్వం ప్రారంభయౌవనుని సంభ్రమాశ్చర్యాలను విడువదు. ఆర్ద్ర హృదయంతో కవి కవితా రచనలో తన బాల్య మాధుర్యాలను ఆహ్వానించుకోగలగాలి (Summoning the childhood-Paual Eluard) ఆ శక్తే కవిత్వాన్ని సర్వజన ప్రియకరంగా మారుస్తుంది పరిపూర్ణ చేతస్సుతో, దర్శనావైదుష్యంతో ఈ కవి హృదయం మరుక్షణంలోనే సాక్షాత్కరిస్తుంది. ఈ సమ్మేళనం వల్లనే కవిత్వానికి నిత్యయౌవనం ప్రాప్తిస్తుంది.

'సూర్యుడి స్వగ్రామం' ఒక్కసారి చదవమని పాఠకులను కోరుతున్నాను :

'సూర్యుడు అస్తమించని
నామాటల దేశాల్లో
చెమట ముత్యాల కిరీటాలు దాల్చిన
దేవతలు......
... ... ...
మూస్తే నాకళ్ళు
నిద్రిస్తున్న ఆపిల్ పళ్ళు
తెరిస్తే నాగుడ్లు
వరివెన్ను కన్న వడ్లు
... ... ...
నా యుద్ధాల పొగల్లోంచి

పద్యాల ముఖాలు పుడతాయి
నాగొంతు జలపాతానికి బెదిరి
చెదిరిపోతారు కాకుల్లా
కాలపు మేకులకు వ్రేలాడే కవులు
... ... ... ...
ఎత్తితే నాచేయి,
మండే అగ్నిజ్వాల
దించితే,
వేయి కిరణాలు వ్రేలాడే
సాయం సంధ్య !
... ... ...
నేను ప్రసరించే కాంతుల్లో ప్రశ్నలు
మధ్యాహ్నాలు నడుస్తున్న మార్గాలు
నీకు వదలిపెట్టి
చీకటి లోకాలకు దారి
వెతుక్కుంటూ పోతాయి...

ఇందలి ప్రతి కవితలోనూ మండే సూర్యుడి ప్రసక్తి స్పష్టంగా ఉంది. ఈ కావ్యంలో పాత్రవహించే సూర్యుడు దేనికి ప్రతీకగా నిలుస్తున్నాడో లోగడ వివరించాను. ఏ కవిత నుంచయినా సంగ్రహంగా నాలుగు పంక్తులు మాత్రం ఉల్లేఖించి విడిచిపెడదామంటే సాధ్యంకావడం లేదు. ప్రతికవితా ఆసాంతంవ్యాఖ్యానించు కోవలసిందే. అయితే వ్యాఖ్యాతే ఆ బాధ్యత వహిం

చడం సాధ్యం కాదు. కనుక సహృదయ పాఠకుడు ఎవడికి వాడుగా మౌనంగా వ్యాఖ్యానం చేసుకోవాలి. విమర్శకుడు దానికి సుగమ మార్గం చూపగలడు. అంతే! తానే పాఠకునికి వాహనమై మోసుకుపోలేడు.

ఈ కవితలో శేషేంద్ర తన సహజ ధోరణిలో అపార ప్రసాద గుణాన్ని సంసిద్ధం చేశాడు. ఉత్తమ కవితలలో ఇది అరుదుగా సాక్షాత్కరించే గుణమే! ప్రతి పాదంలోనూ కవితా భావ చిత్రం అతిస్పష్టంగా పరుచుకొని ఉంది. భాషా పరమయిన క్లిష్టతకు భావావిష్కరణలో అనవగాహతకు ఎక్కడా అవకాశ ముండదు. అయితే ఎవరేనా తమకు స్పష్టంగా అవగాహన కావడంలేదని అంటే అది వాళ్ళ కవితా సంస్కార దారిద్ర్యమే తప్ప అన్యంకాదు. దానికి విమర్శకుడు సహాయపడలేడు. పాఠకుడెంతో కొంత భావుకుడయిన నాడు విమర్శకుడు కాంతి కళిక అందించ గలడు. ఈ కావ్యం ఎత్తుగడ నుంచీ సూటిగా చెప్పదల్చుకున్న విషయంలోకి వెళ్లిపోతుంది. అనవసర ప్రాగల్భ్యాల జోలికి పోదు. భాషా భేషజంతో అరిపేద పఠితను బెదర గొట్టను. ఒక్కొక్క కవితాభివ్యక్తిని ఈ కవి ఎంత చెక్కడపు బొమ్మలా తీరుస్తాడంటే ఆభావాన్ని ఇంకేవిధం గానూ వ్యక్తం చేయడం సాధ్యం కాని రీతిలో మలుస్తాడు. మాటలను వాడటంలో ఎంతో పొదుపరితనాన్ని, భావాన్ని విస్తరించనీయని సంగ్రహాత్వాన్ని (Succinctly) ప్రయోగిస్తాడు.

'But wonder of this case is that it is so full of poetry' అనవలసిన స్థితిలో దిగ్భ్రమ కలిగిస్తాడు. కవితా స్పర్శ లేని వ్యర్థ వాక్యమూ, పదమూ, పద సముచ్చయమూ వెదికి పట్టుకుందామన్నా దొరకవు. ఈ లక్షణంలో కూడా ఈ కవిని ఎపోలినెయిర్‌తో పోల్చవచ్చు. 'The words are Commonest words from the speech of everyday, but they are none the less so fresh and lively that the attention is immediately arrested and held', అని బౌరా ఎపోలినెయిర్ గురించి చెప్పిన వాక్యం అక్షరాలా శేషేంద్రకు వర్తిస్తుంది. శేషేంద్ర ప్రయుక్తంచేసే పదశిల్పంగురించి వివరించడానికి ఈ వాక్యం కూడా చక్కగా సరిపోతుంది. "Every word does its work at the same level of power and ease..."

సూర్యుడి స్వగ్రామం అనే పైన ఉల్లేఖితమైన కవితలో గంభీరభావ చిత్రాలను ఆవిష్కరించడంకోసం గంభీర పదచిత్రాలను ప్రయోగించాడు. కవి వాడేమాటలు ఒక్కొక్కటి ఒక్కొక్క దేశం వంటివి అలాంటి దేశాల్లో సూర్యుడు అస్తమించడు. ఏమాట పైనా చీకట్లు క్రీనీడలు తారాట్లాడవు. అంటే అతని శాబ్దిక సామ్రాజ్యం రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం అనిగర్వంగా కీర్తించబడిన సామ్రాజ్యం కంటే బహువిస్తృతమైంది శక్తి వంత మయింది. అయితే ఆ బ్రిటిష్ సామ్రాజ్యం దోపిడీదారుల మురా కిరీటాలతో మెరిసినది. కాని ఈసామ్రాజ్యం దేవతలతో

నిండినది. ఆ దేవతలెట్టివారు? చెమట ముత్యాల కిరీటాలు ధాల్చినవారు. అంటే శ్రమాఖిన్న జీవితంలో స్వేదమౌక్తికధారులు దోపిడికి గురవుతున్నవాళ్ళే తప్ప, దోపిడీకి పరికరాలు కాలేని వాళ్లు దేవతలవలె స్వచ్ఛంగా నిర్దుష్టంగా బ్రతకజూచేవాళ్ళు. అలాంటి దేవతలతో నిండిన మాటల దేశాల్లో సూర్యుడి స్వగ్రామం ఉంది. అక్కడ కవి కన్నులు మూసుకుంటే అవి ఆపిల్ పళ్ళవలె నిద్రిస్తూ మెరుస్తాయి. తెరిస్తే ఆ కనుగుడ్లు వరి వెన్నులెత్తిన వడ్లుగా భాసిస్తాయి. మూసినా తెరిచినా మధుర మైన అనుభోక్తవ్యాలే. కవి మాటల సామ్రాజ్యంలో యుద్ధాల జరిగాయి. ఆ యుద్ధాలలో కూడా పొగలూ సెగలూ వెలి కుబికాయి. అయితే అవి జీవన హననానికి కారకమైన యుద్ధాలు వంటివి కావు. ఆ పొగ జీవ పదార్థాలను మండించగా వెలువడే కమురు కంపు పొగ కాదు. ఈ పొగ కవితాసృజనలో తన హృదయం పరిసరాలతో ఘర్షించినప్పుడు బాహ్యావాస్త వాలు 'సబ్లిమేట్' కాగా వచ్చిన పొగ. ఆపొగలలోంచే పద్యాలు- అంటే కవిత జీవితసంఘర్షణాజన్యమని చెప్పడానికే. కవి గొంతు జలపాతం వంటిది. ఆ జలపాతసంతతధారాధ్వనికి కాకులూ వగయిరా అల్పజీవులు చెదిరిపోతాయి. ఈ కవితాజల పాతధ్వనికి కవులే బెదిరి చెదిరి పోతారు. ఈ కవుల ఉనికి ఎక్కడ? వాళ్లు కాలమనే మేకులకు వ్రేళ్ళాడుతున్నారు. లేదా కాలకుడ్యంపై మేకులకు వేళ్లాడే పటాలలో నామమాత్రంగా జీవిస్తున్నారా కవులు. వీళ్ళంతా బెదిరి పోతారు. కవి

అపూర్వమూ నవీనమూ, శక్తివంతమూ అగు కవితాజలపాతాన్ని సృష్టిస్తున్నాడు. దీనితో సాంప్రదాయకంగా కాలావధిలో వ్రేలాడుతున్న కవితా మూల్యాలు కొట్టుకుపోయి కొత్త విలువలు స్థాపితమవుతున్నాయి. దానికి కారణం లేక పోలేదు. "ఎత్తితే నా చేయి మండే అగ్నిజ్వాలలా, ఉదయ సూర్య తేజంలా భాసిస్తుంద"ని కవి చెప్పుకున్నాడు. దించితే వేయి కిరణాలు వ్రేలాడే సాయం సంధ్య కవి. తానే మండే సూర్యుడు. శ్రమైక జీవనంలో చేయి ఎత్తడం దించడం సామాన్య విషయాలు. అవన్నీ సూర్యసాదృశ్యాలు. కనుక తాను ప్రసరించే కాంతులలో వక్రరేఖలవంటి ప్రశ్నలు మధ్యాహ్నాలలో తాను నడుస్తున్న అడవి దారులు. కవి పురోగమిస్తుంటే, వెనుక బడిన మార్గాలవి. తాను విడిచి పెట్టిన చీకటిలోకాలకు దారి వెతుక్కుంటూ పోతాయి, కలవరపెట్టే ప్రశ్నలు. కవితా పరిష్కృతినిపొంది ప్రశ్నలు తమ అస్థిత్వాన్ని కోల్పోతాయని కవి తాత్పర్యం. కవి చెప్పిన ప్రతి మాటా ఎంతో ఓజస్సుందరంగా అమరి ఆలోచనాతరంగాలు మేల్కొలుపుతుంది. సుప్తచైతన్యాన్ని సంచలింపచేస్తుంది. ఇక్కడ కూడా పౌరా వాక్యమే మనకు సహకరిస్తుంది. "He speaks solemnly with an air of dignity and needs the resources of authority behind him"...

రసజ్ఞుని మనసును చూరగొనే తరవాత కవిత— 'రాలే ఆకులు'. అందులో ఇలా అంటాడు· 'జీవితం క్షణాల్ని హేమంత పత్రాల్లా రాలుస్తోంది. ప్రత్యూషకాలంలోని నక్ష

త్రాలవలె ఆశలు మాసిపోతున్నాయి. మనం ఆయువు కోసం పీల్చే వాయువులో ఈ యుగం హాహాకారాలను పోసింది, ...". మనిషి ఆయుర్దాయం అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాల సంఖ్యపైనే ఆధారపడిందని యోగశాస్త్రం చెబుతుంది. కాని మన యుగం చాలా విచిత్రమైంది. సంచలనాత్మకమైంది. మనం పీల్చే గాలినిండా హాహాకారాలు నిబిడీకృతమయ్యాయి. ఈ జగత్తు ఎలా మారింది? మానవత్వమనే జీవన లహరి తన దారిని కోల్పోగా ఎడారివలె మారిపోయింది. కనక మనం కొత్తగా నైరాశ్యంలో కూరుకు పోవాల్సిన పని లేదు. స్నేహితుడా సముద్రంలాంటి ఆ కన్నీటి బొట్టు ఎందుకు? అని అడుగుతాడు కవి. కన్నీటిబొట్టు ఒక్క బిందువే కావచ్చు. అందులో ఉప్పని ఉదధులెన్నో ప్రతిబింబిస్తాయి.

శేషేంద్ర హృదయంలో ముసిరే ఆలోచనలు బొమ్మలుగా మారి మనముందు కుమ్మరించబడటం ప్రతికవితలోనూ గమనిస్తాం. అయితే అతడు యథార్థంలోక చిత్రాలను యథాతథంగా మన ముందుంచ డానికి ప్రయత్నించడు. అలా ప్రయత్నించేవాడు కవి కాడని ఇతని విశ్వాసం. కనకనే కవితా వరప్రసాద లబ్ధితో లోక వాస్తవికతలకు కవితారసయోగం కల్పించి మనముందు ప్రతిష్ఠిస్తాడు. "నిశ్శబ్దాలు' అనే కవితలో ఈ రసయోగం అతి వేల్పైన భావనా చిత్రాలను నెలకొల్పుతుంది:

'కొండల నిశ్శబ్దాన్ని
బొట్టు బొట్టుగా చప్పరిస్తున్నప్పుడు
చప్పుడు చేసే నా గుండెను కూడా క్షమించలేను
అడవిని పక్షి పాటతో కొలుస్తాను
లేకపోతే సెలయేటితో కొలుస్తాను'

అంటాడు కొండలు నిశ్శబ్దంగా నిలిచి తన హృదయానికి బొట్టు బొట్టుగా ఒక మధురానుభూతిని అందిస్తున్నాయి అడ్డూ ఆపూ లేకుండా మోగ్రే గుండె, అదే పనిగా చప్పుడు చేస్తూ తన ఏకాగ్రతకు భంగం కలిగిస్తోంది. అలాంటి సమయంలో తన గుండెనయినా క్షమించలేని చికాకు కలుగుతుందంటాడు. అడవి సౌందర్యాన్ని ఎంత వర్ణించినా మనో నయనంవరకే దాని అను భూతి పరిమిత మవుతూంది. అడవి పక్షి పాట శ్రుతపూర్వమైన అనుభూతులను ప్రేరేపిస్తుంది. వాసనలను ఎగసన్రతోస్తుంది. పిట్టను ఎలా పోల్చుకోవడం? దాని పాటతో నే-పాటకు దాని రూపురేఖలు ఆవరించి ఉంటాయి. లేదా అడవిని సెలయేటితో కూడా కొలవవచ్చు ఆటవిక గంభీర నిశ్శబ్దంలో పిలపిల సవ్వ డులు కల్పిస్తూ తొందరగా పారిపోయే సెలయేటితో ఆ అడవి సౌందర్యానికి ఒక మూర్తిని కల్పించుకోవచ్చు.

'దిగంతరేఖ' అనే కవితలో —"నదులు వెనక్కి తిరిగి కొండల్లోకి పోతున్నాయి. కొండలు తమ గుహల్లోకి పోతు న్నాయి" అంటాడు. ఈ సాధారణోక్తిలో అసాధారణ భావ స్వరూపం నిబిడమై ఉంది. బాహ్యస్వరూపాలు అంతస్సత్వంలోకి

విలీనం కావడం కవి స్పష్టపరచ దలిచాడు. ఈభావాన్ని ప్రస్ఫుటంగా ప్రచలితంగా చెయ్యడానికి ఈ కవితలో ఎన్నో పద చిత్రాలు ప్రయుక్తమయ్యాయి. చెట్లలో కలిసిపోయే మనుష్యులు, పువ్వుల్లో కలిసిపోయే చెట్లు, పళ్ళల్లో కలిసిపోయే పువ్వులు, గింజల్లో కలిసిపోయే పళ్ళు, ఇలా ఒక అనంత జీవన హేల మన కనులముందు తెరుచుకుంటుంది. కవి హృదయం భుజం వంటింది. ప్రతి చెట్టూ తన పువ్వులలో సువాసనలు దాచుకుంటుంది. మధువులు దాచుకుంటుంది. ఆ సువాసలను ప్రతి నాసికా గ్రహిస్తుంది. పూల మంజులత్వాన్ని వివిధ వర్ణ వితానాన్ని ప్రతి కన్నూ పరిగ్రహిస్తుంది. ప్రతిముని వేలూ వాటి మృదుత్వాన్ని అనుభవిస్తుంది. కాని పూలకడుపులో దాగిన తేనెల్ని మాత్రం ప్రతి జిహ్వ ఆస్వాదించలేదు. ఒక్క మధువిహానికే ఆ శక్తి ఉంది. అది పూల గుండెల లోతుల్లో తన సూక్ష్మమైన తొండాన్ని జొనిపి బొట్టుబొట్టూ పీలుస్తుంది. అది తేనె కోసం ప్రతిరోజూ చెట్టుచెట్టునీ వెతుకుతుంది. కొమ్మకొమ్మనీ బతిమాలుకుంటుంది. ఉన్న పువ్వులన్నిటిమీదా వాలి తేనెల్ని స్వీకరిస్తుంది. అలాంటి వేలాది తేటులు లక్షలాది తేనె బొట్లను తమదవడ దొప్పల్లో దాచి తెచ్చి తేనె తుటలో నింపి నిలువచేసుకుంటాయి. తమ భావి తరాలకు జీవన వారసత్వంగా అందిస్తాయి. పూవు పిందెగా మారు తుంది. పిందె కాయగా పెరుగుతుంది. కాయ పక్వఫలమై పరిపూర్ణమవుతుంది. అది రూపమైన పూవు ఎన్ని పరిణామాలు చెందినా తన సహజ

లక్షణాలైన పరిమళాల్ని మధుర రసాల్ని తేటులకు పూర్తిగా దానం చెయ్యక తనకోసం కొంత దాచుకుంటుంది. ప్రతి దశ లోనూ ఆ తేనెల రూపాంతరాలను పరిపోషించుకుంటూనే ఉం టుంది. అది అలా ఫలంగా పరిపక్వమైనా దానికి మాధుర్య రస మిచ్చేది బిందు రూపంగా పుష్పంలో దాగి ఉన్న మధువే ఆధా రం. పండులో అది మరింత మధురరసంగా పరిపూర్ణమై సర్వజీవు లకు ఆస్వాదమవుతుంది. అలాగే కవిహృదయంలో భావ లేశంగా, స్వప్నశకలంగా అంకురించిన కవితానుభూతి ప్రవర్ధమై పక్వమై ఫలసదృశ్యమై, కళాస్వరూపంగా అభివ్యక్తమవుతుంది. ఒక మధుర స్వప్నం కవితగా వెలార్చబడినపుడు మాత్రమే రసజ్ఞులందరికి ఆస్వాద్యమవుతుంది. కుసుమగత మధువు మధు పానానికి మాత్రమే అనుభవయోగ్యమై ఆనందాన్ని కలిగించి నట్లు కవి మనోగత భావనా మధురిమ అతని హృదయానికి మాత్రమే ఆనందం చేకూరుస్తుంది. అది సర్వజన ఆనంద పర్యవ సాయిగా పరిపక్వం కావడానికి సాధారణ లౌకికార్థ విశేషాం గాలను సంతరించుకోవాలి. అనుభూతి సంకేతాలనందుకోవాలి. బింబ ప్రతిబింబ సమాహారాన్ని సమాయత్త మొనర్చుకొని సుష్టురూపమైన కావ్య ఫలప్రదానం చెయ్యాలి. అప్పుడే అది సర్వజనామోదకరమవుతుంది. ఇంత భావనా సోపాన శ్రేణిని ఈ నాలుగయిదు పదచిత్రాలలో కవి సాధించాడు. 'దిగంతరేఖ ఆకాశం విప్పి నాలోంచి ఎగిరిపోయింది.' అలా ఎగిరి ఎగిరి 'మళ్ళీ సముద్రంమీద పడుకొని నక్షత్రలోకాల్ని చూస్తూ

ఉంది.' అన్న వాక్యం ఎంతో హృద్యంగా ఉంది. ఇంతవరకూ ఆ దిగంతరేఖ ఆకాశాన్ని ధరించి ఉంది. ఇప్పుడే దాన్ని విప్పేసింది. తనలోంచి ఎగిరిపోయింది. మళ్ళీ సముద్రంమీద పడుకుని నక్షత్రలోకాన్ని చూస్తోంది అనడంలో జగత్ప్రళయం ధ్వనిస్తోంది. జగత్ప్రళయం తరవాత నిర్మలకలశాంబుధిలో శేషశాయి పునస్సృష్టి ఎలా ప్రారంభించడమా అని ఆలోచిస్తున్న ధ్వనిని మన వాసనా సముచ్చయం మన మనసుకందిస్తుంది.

స్వచ్ఛమైన భావాలు స్వచ్ఛమైన పదాలలో వ్యక్తం కావడంకన్న ప్రబల ఆయుధం వేరేలేదు' అంటాడొక ద్రష్ట (The clear thoughts expressed in clear words, that is only one more weapon) ఈ కవితాశక్తి "పోదాంపద" అనే కవితలో మరింత విరబూసి దర్శనమిస్తుంది. "పొలాల్లో రాలే చెమటబిందువుల్ని ధాన్యపుముత్యాలుగా మార్చి భూమి గాయాలు మాన్పుదాంపద!" అని ఆహ్వానిస్తాడు కవి. పొలాల్లోరాలే చెమట బిందువులే ధాన్యపు ముత్యాలుగా పరివర్తన చెందుతాయి. ఆకలితో అలమటించే నిర్భాగ్యులవల్ల భూమి గాయబడి ఉంది. ఆ గాయాల్ని ఈ ముత్యాలే మాన్పగలవు. "ప్రేమవానల్ని కురుద్దాంపద" భూమి ప్రేమవానలకు నోచుకోక కళమాసి ఉంది. ఈ కవిత రెండు భిన్న స్థాయిలలో రెండు విభిన్నార్థాలను పఠితకు కలిగిస్తుంది. ఉపరితలానికి మనోహర ప్రేమగీతిలా కనిపిస్తుంది. లోతుగా ఆలోచించే వారికి కర్మణ్యత్వాన్ని ద్యోతకంచేసే సామాజిక ప్రమేయంగల

కవితగా స్పష్టపడుతుంది. ఈ ఆదునిక యుగంలో సృష్టించబడే ప్రేమగీతం కృష్ణశాస్త్రియుగంలోని ప్రేమగీతివలె సురలోక సంచారం చెయ్యదు. మృణ్మయమై ధూళి ధూసరితమై వాస్తవ జీవన అంతస్సత్వాన్ని స్వాయత్తం చేసుకుంటుంది. ఆధునికుని అవగాహనలో ప్రేమ సాఫల్యాల వైఫల్యాలు కేవల వ్యక్తినిష్ఠాలు కావు. వాటితో సమాజానికి ప్రమేయం ఉంది. కనుకనే ఆధునిక ప్రేమగీతంకూడా సమాజ ప్రమేయంతోనే సాగుతుంది. ఈ లక్షణానికి లక్ష్యప్రాయమైన దృష్టాంతంగా ఈ గీతాన్ని చూపవచ్చు.

'పోదాంపద ఆ అడవుల్లోకి
ఎక్కడరాలే హేమంతపత్రాలమీద
సూర్యుడు మనిషికోసం
సందేశాలు రాస్తున్నాడో
ఆ అడవుల్లోకి ! ...

తెలుగు కవితావాహినిలో మొట్టమొదటి హేతువాది వేమనయోగి ఆయన ఉట్టినే అనలేదుఉప్పుకప్పురంబు నొక్క పోలికనుండు, చూడచూడ రుచుల జాడవేరు; పురుషలందు పుణ్యపురుషులు వేరయా, అని అర్థోక్తిగా ధ్వనించిన సత్యం త్రికాలాబాధితమై అద్భుతంగా మెరుస్తుంది. ఈగలూ తేనె టీగలూ షట్పదాలే. కాని తేనెటీగలు పూలమీదనే వాలుతాయి. ఈగలు ఎక్కడ వాలతాయో చెప్పనక్కరలేదు. కనీసం ఈ

యుగంలోనయినా మనుషులు ఈగలా నీచత్వానికి దిగకూడదు. ఎక్కడ బెల్లంఉందో ఎక్కడ గాయం ఉందో వెతుక్కుంటూ వచ్చి వాలడమే పనికాకూడదు. ఈగల్లా మనుషులు దైన్యంతో మూలగకూడదు. నీచంగా బ్రతక కూడదు. సామాన్య మానవులు మానవత్వపు మహాశక్తితో పునీతులు కావాలి—'ఈగలు' అనే కవితలో శేషేంద్ర వాంఛిత మిది "కష్టాల అగ్నుల్లోంచి ఖడ్గాలై పుట్టండి" అని ఈ కవి మనుష్యుల్ని కోరతాడు. నిజమే దినవారీ కష్టాలు అగ్నులై మనిషిని కాలుస్తున్నాయి. ఈ కాల్చడంలో మనిషి కట్టెపుల్ల లాగ నుసై పోకూడదు. లోహంవలె కాఠిన్యం అలవర్చుకోవాలి. మెత్తని ఇనుమును కాల్చగా ఉక్కుగామారి దృఢతరమవు తుంది. అలాంటి ఉక్కే ఖడ్గానికి పనికివచ్చేది. దుర్భరంగా మారిన బాహ్య వాస్తవికతను ఖడ్గమే పరిమార్చగలిగేది. కనకనే కష్టాలలోంచి ఖడ్గాలై పుట్టమని మనిషికి సందేశమిస్తున్నాడీకవి. "ఈగలు డేగల్ని తరిమికొట్టే తారీఖు రోదసి గోడలమీద రాయండి, తోటి పశుల్ని వధించి భుజించే భయంకరమైన డేగల్ని ఈగల సమూహం తరిమికొట్టగలదు. ఆ తారీఖును నిశ్చయించి రోదసి గోడలమీద రాయమని ఉద్బోధిస్తున్నాడు. ప్రజలకలాంటి ఉద్బోధచేసి తాను హాయిగా అంతఃపురంలో దాగుని సుఖాలనుభవించడం ఈకవి అభిమతంకాదు. కనకనే "నేనే మీరస్త్రాన్నై కలలుకంటున్నాను. వడివడిగా నడిచే మీ ముందడుగుకోసం." విశ్వాసపూరితంగా జనంతో తాదాత్మ్యం

ప్రకటిస్తున్నాడు. జనంతో కలిసి సహగమనం చేయడమేకాదు, జనం నడవడానికి తానే దారిగా పరుచుకుంటానంటాడు. నిజమే మనమందరమూ తుఫానుల్లోనే జీవిస్తున్నాము. అలా అని ఒక చిన్న తారను వెలిగించుకొని సంబరపడ్డానికి అవకాశంలేదు. భళ్ళున తెల్లారి హాయిగా కాంతిమయంగా లోకం వెలగాలంటే మండే సూర్యుడేకావాలి...కవి మేధావి సమాజానికి పతాక సన్నిభుడు. కనుకనే ఈ కవి అంటాడు. పదండి మీ జెండానై ఎగురుతాను! అని ప్రజలతో మమేకత్వం చెందే ఏ కవికయినా ఇలాంటి భావాలే పుడతాయని మయకొవిస్కీ కంఠోక్తిగా సాక్ష్యం పలుకుతున్నాడు.

From behind storm clouds thunder emerged. ferociously
Blew its colossal nose with reverberating bark.
And sky-face for a second twiched rapaciously
In the grim grimace of an iron Bismark

ప్రఖ్యాత కావ్యం 'A cloud in trousers' లో రష్యన్ కవి మయకోవ్‌స్కీ సందర్భానుసారంగా పై వాక్యాలను కొంత తీవ్రధ్వనితో వాచ్యం చేయకపోలేదు. శత్రు సమూహాలను వేలెత్తి చూపాడు. వాచ్యం చేయడమే ఒక్కొక్కప్పుడు రసోద్దీపకమవుతుంది. శేషేంద్రమాత్రం ధ్వనించి విడిచిపెడు తున్నాడు. 'ఓడ మునిగిపోయింది' అనే మరో ఉత్తమ కవితలో ఒక మానవ విప్లవం పీగిపోవడాన్ని సూచిస్తాడు. "అస్తమించే

నక్షత్రలోకాల్ని ఆవులిస్తూ చూసించిందికాలం" అస్తమించడం, ఆవులించడం అనే రెండు క్రియలద్వారా—కాంతి నిష్క్రమించడాన్ని, ఉద్యమం అలసిపోవడాన్ని సూచిస్తున్నాడు.

'పళ్ళగుత్తులు' అనే కవితలో- "నోటినిండా సూర్యుణ్ణి కొరుక్కుని తింటున్నా, పెదవుల కొసల్నించి, ఎర్రకాంతుల రసం జారిపడుతోంది" అన్న ప్రారంభ వాక్యంనుంచే మన మానసిక వాతావరణాన్ని మార్చేస్తాడు. అతి సాధారణ పద చిత్రాలతో, అతి లోకమైన భావచిత్రాన్ని సాధిస్తాడు. తాను సూర్యుణ్ణి నోటినిండా కొరుక్కుని తింటున్నాడు. అంటే తాను ప్రత్యూషకాలపు తూర్పుదిక్కు. నోటినిండా సూర్యుణ్ణి కొరుక్కుతింటున్నపుడు సెలవులువారి ఎర్రకాంతుల రసం జారి పడుతుంది. తూరుపు దిగంతాల పెదవులు కొసలనుంచి ఎర్రని కాంతులు ప్రసరిస్తున్నాయి.

"అడవుల్లో సంచరిస్తూ దారి తప్పిన
లంబాడీ ఒంటరితనం
నా యెదుట పడింది
పళ్ళు కాలాన్ని వేటాడే క్రూరమృగాలు
చూపులు గగనంలో ఎగిరే గాలిపటాలు
ముద్దులు నన్ను అద్దుకునే నా ప్రతిధ్వనులు"—

అద్దాల గాగరాలు ధరించిన లంబాడీల వంటి పూవుల చెట్లూ, సెలయేళ్ళూ, కవికి దర్శనమిచ్చాయి. కాలాన్ని వేటాడే

క్రూరమృగాలుగా పళ్ళూ కనిపించాయి. అప్పుడు కవి చూపులు గగనంలో ఎగిరే గాలిపటాలు. తన హృదయపు ప్రతిధ్వనులు తనని ఏవో ముద్దులు అద్దుకుంటున్నాయి.

"వదరుబోతు పువ్వుల్ని శిక్షించాలని
నా నిశ్శబ్దాన్ని వాటికి మీదికి రువ్వాను"

గాలితో పరాచికాలాడుతున్న పువ్వులు వదరుబోతుల్లా కలవర పడుతున్నాయి. తనదారి కిరువైపులా పళ్ళూ పువ్వులూ,కాలాన్నీ అవకాశాన్నీ జయిస్తున్నట్లు ఎరగబడుతుంటే తన మానసిక నిశ్శబ్దాన్ని వాటి మీదకు రువ్వాడట. ఇంతవరకూ తన మనస్సులో నిశ్శబ్దం ఉంది. అది రువ్వబడగా తన మనస్సు కూడా వాటితో పాటు కళవళ పడుతోంది.

"మట్టితో జీవశిల్పం మలిచే వాడి ముందు
శూన్యంతో రేఖలు వంచే వాడి ముందు
రూపాలు మోకరిస్తాయి:
సున్నలో బంధించబడ్డ ఆకాశం
ఉదయాస్తమయాల రంగుల్లో స్నానం చేసే,
ఋజురేఖకోసం కలలు కంటూ ఉంది"

మట్టితో జీవ శిల్పాలు మలిచే వాడి ముందు రూపాలు మోకరిస్తాయి. కర్మణ్యత్వానికి ఆ అధికారం సహజం. తలయెత్తి చూస్తే కనిపించి నంత మేరా ఆకాశం గుండ్రంగా పెద్దసున్నలో

బంధించ బడ్డట్టే ఉంటుంది. దీనికి కారణం మనం గుండ్రని భూగోళం మీద నివసించడమే కావచ్చు. ఉదయాస్తమయాలలో మాత్రం సూర్యుడు భూమికి సమాంతరంగా నిలుస్తాడు. దిగంతాలను రంగులలో స్నానం చేయిస్తాడు. ప్రస్తుతం సున్నలో అంటే శూన్యంలో ఇమిడి పోయిన ఆకాశం అలాంటి ఋజురేఖకోసం కలలు కంటోంది. అరుణ కాంతులలో మునిగి ఆకాశమైనా, ఆదర్శమైనా నవోజస్సుల సంతరించుకుందుకు ఋజురేఖ వంటి వ్యవస్థ కావాలని ధ్వనిస్తున్నాడు. ఈ కవిత అపారంగా సాధించుకున్న భావ చిత్రణాశక్తికి ఒక ప్రబల దృష్టాంతరం. అంతా కలసి ఈ కవిత ఇగ్గవై పంక్తులే.

"సూర్య బిందువు, అనే కవితలో "చీకటి రాబందులు కనుగ్రుడ్లు తింటున్నా" యంటాడు. ఈ క్రూరమైన పదచిత్రం వెనక ఒక భావచిత్రం తళుక్కు మంటుంది. కళ్ళు పీక్కున్నా కనిపించని కటిక చీకటి, అది రాంబందుల్లా ఉంది కనుగుడ్లను పీక్కు తింటున్నట్లుగా బాధగా శూన్యంగా ఉంది స్థితి. "చెవుల్లో గంభీర నిశ్శబ్ద ఘంటలు మ్రోగుతున్నాయి." చీకటిలో నిశ్శబ్దంలో ఏకాంతంలో భీతితో సాగే జీవికి తన గుండె మోత్రలే పెనుగంటల మ్రోతలై మరింత భయపెడతాయి. ఆ పరిస్థితిని నిశ్శబ్దఘంటలు అనే పరస్పర వ్యతిరేక ధర్మాలుగల శబ్దాల పోహళింపు ద్వారా చిత్రించాడు కవి. ఇంగ్లీషులో Oxymoron అనే ఒక చక్కని అలంకారముంది. దీన్ని నిశితంగా శిల్ప సంపన్నంగా ప్రయుక్తం చేసిన షేక్స్పియర్ ప్రశంసనీయు

డయ్యాడు. పరిస్పర వ్యతిరేకార్థ ద్యోతకాలైన శబ్దాలను సంపుటి కరించడం ద్వారా ఈ వక్రోక్తి సాధింబడుతుంది. దీనికి ఆంగ్లం లోనే ఉదాహరణ చూపడం అవగాహనకు మరింత దోహద కారి కాగలదు: "Faith Unfaithful kept him falsely true". ఒక్క చుక్కయినా ఆకాశం మీద వెలగడం లేదు. దారి కనిపించక నడవలేక మోకరిల్లాడు. మొదట ఉదయించిన ఏతారక కయినా మొక్కుదామన్నట్లుగా ఉంది వర్తమాన మానవుని నిస్సహాయత. చివరికి కుపితుడై చీకటితో సంఘర్షించడానికి నరాలు బిగించాడు. రక్తంచిందింది. ఆ రక్తబిందువులతో దీపాల తోర ణాలు కట్టినట్లుగా తూర్పులో రంగులు తేరుకుంటున్నాయి. ఆ తోరణాన్ని, ఆ సామూహిక జనశక్తిని సాదా గాలి కాదు కదా తుఫాను కూడా ఆ వెలుగుల నార్పలేదు. ద్రాక్ష పళ్ళ రక్తం త్రాగినట్లుగా ఒక నాజూకు నిషా అనుభవ పూర్వకమవు తున్న స్థితి అది. ద్రాక్ష పళ్ళను చేతులారా నలిపి రసం తీసి, వాటి ప్రాణంతో పాటు జీవన తృష్ణనుకూడా హరించి,మాన వుడు తనతృష్ణను తీర్చుకుంటున్నాడు. చీకటిరాత్రిలో వెలుగు రేఖకోసం నిరీక్షించే ఆనుభూతికి ఈ కవిత చక్కని చిత్రపటం అందించింది. ఈ ఘనీభావస్థితి ఎంతోసేపు ఉండదు. రాత్రి పాలలో ఎప్పటికయినా సూర్యకాంతిబిందువు పడుతుంది. అప్పుడు తెల్లని దధి, దీధితిలో దినకరావాప్తినందుకుంటుంది. ఇది మనకు కలిగించే భరోసా.

'జింకలు' అనే తరువాత కవితలో "రాత్రి ఒక పావురంలా తన గుండెమీద వాలింది. బాధల తుఫానుని ఒక్క నవ్వుతో తుడి వేశా"డు కవి:

'కలల్లో జింకల్ని
తరుము కుంటూ పోయాను
కలం ఎక్కు పెట్టి-
ఒక అశ్రువు నన్ను మోసం చేసినా,
చంద్రుడు లోకం మీద
తన తెల్లజెండా ఎగురవేశాడు'.

కవి కలల్లో కనిపించిన జింకల్ని తరుము కుంటూ ఎక్కు పెట్టిన బాణం వంటి కలంతో తరుము కుంటూ పోతున్నాడు. అయితే వెర్రిబాగుల రామునిలాకాదు. మూర్ఖంగా మారాం పెట్టే పెళ్ళాం మాట విని కాదు. అలా కలలో మృషా హారిణాలను అన్వేషిస్తూ పోతున్నప్పుడు అశ్రువులు తనని మోసం చేస్తాయి. కాని చంద్రుడు తన ఓటమిని అంగీకరిస్తూ లోకం మీద తెల్ల జెండా ఎగర వేసినట్లు చల్లని వెన్నెలలోకి తన జాగృతి తెరుచు కుంటుంది. ఇలా మనం అన్వయం చేసుకున్నా ఈ పద చిత్రా లలో కొంత అయోమయత లేక పోలేదు. రాత్రి పావురంలా గుండెపై వాలిందన్నపుడే అది వెన్నెల రాత్రన్న స్ఫురణ వస్తోంది. ఓటమికి ప్రతీకలయ్యే తెల్లజెండా ఎగరవేయడం అనే పదచిత్రంలోని ఔచితి చప్పున స్ఫురించదు. స్వాప్నిక మాయా హారిణాలు తనను మోసం చేయ పూనుకున్నప్పుడు చంద్రుడు

తనకాంతులతో తన సహాయకారిగా వస్తాడని ఈ పదచిత్రాలను మలచి ఉంటే బాగుండేది.

దూర దూర సీమలకు
మనిషి చేతి కందని సీమలకెక్కడికో
కొండల ఒడిలోకి
అడవుల గర్భకుహారంలోకి
ఎక్కడికో పదమంటుంది
నా ఆత్మ.
గాలి రైళ్ళలోకి దూకుతుంది
మేఘాల బిడారుల్లో కలుస్తుంది
దిగంతరేఖ మీద మెరిసే నిశ్శబ్దం కోసం
పెరుగుతున్న తృష్ణ తీర్చు కోవాలంటుంది."

ఇదంతా శాంతి యాత్ర అనే మరో కవిత ప్రారంభం. మనిషిని సర్వదా దూర దూర సీమల కెక్కడికో వెళ్ళమంటుంది ఆత్మ. ఆ ఆత్మ గాలి రైళ్ళలోకి దూరుతుంది గాలి రైళ్ళు అనడం విచిత్రమైన అభివ్యక్తి. రైలు Train కనక ఒక పెట్టె తరువాత మరో పెట్టెగా వస్తుంది. అలాగే గాలి కూడా కెరటం తరవాత కెరటంగా వస్తుంది. మేఘాల బిరడాలు కూడా ఇలాంటి మనోహర పదచిత్రమే. ఆకాశపు ఎడారిమీద మేఘాలు ఒంటెల బిడారుల్లా అనంతంగా సంచరిస్తాయని కవి చిత్రించ దలిచాడు. అయితే యిక్కడ అంతరాత్మ ఉత్సాహపరుస్తున్నది ఎందుకని? పెరుగుతున్న తృష్ణని తీర్చుకోమని. అది ఎలాంటి

తృష్ణ? దిగంతరేఖ మీద మెరిసే నిశ్శబ్దాన్ని స్వాయత్తం చేసు కోవాలనే తృష్ణ. దివారాత్ర జీవితంలో సంభవించే కలల్లో కొన్ని టిని పీడకలలుగా మార్చే నగ్న వృక్షాల బారినుంచి పారి పోమ్మంటోంది. లోకవృత్తంలోని యథార్థాలు—దారిద్ర్యాలు, బాధలు, జనజీవితాన్ని కలవర పెట్టే ఇబ్బందులు నగ్న వృక్షాల వలె నిలచి సమస్యలై బెదిరిస్తున్నాయి. గాలిలో తియ్యటి అక్షరాలు వెదజల్లుతూ, జీవరాసులన్నీ ఎక్కడ రెక్కల మీదకు ఎగురుతూంటాయో ఆకలల్లోకి ఎగిరిపోమ్మంటుంది ఆత్మ. ఆ కలల లోకంలో రాలే ప్రతి ఆకూ నేలమీద పడి విశీర్ణమయ్యే ముందు, ఒక కవితా నౌకలో తేలుతుంది. సూర్యుడు ఆకాశపు నీలి హాలులోకి ప్రవేశించగానే, కొండలు మేలుకొని చైతన్య వంతాలవుతాయి. అడవులు తొడవులు మార్చుకుంటాయి. దేశ ద్రిమ్మరిలా తిరిగే సోమరి గాలినుంచి కలలు పుష్పాలవలె రాలు తాయి. అక్కడ ప్రాణం ఆటవికమైన గుంపుతనాన్ని విడనాడు తుంది. నిశ్చల నిశ్శబ్దాన్ని అనుభవిస్తుంది. ఉన్నత వృక్షాలు నిశ్శబ్దంగా ఊరేగుతూ కదులుతాయి. అక్కడ కొండల ముందు వాలో భూమ్యాకాశాలు పెళ్ళి చేసుకుంటాయి. పేరు లేని అందమైన పిట్టలు కొమ్మల్లోకి వచ్చి కూర్చునే సరికే పరిసరాలు కవితలుగా మారుతాయి. సంధ్యలో స్నానం చేసిన ఎర్ర యూకెలిప్టస్ తన ఆకు చివరల ఎర్రని పూల బిందువులు అలంకరించుకుని స్వాగతమిస్తుంది. ముద్దుగా జాబిల్లి ఇంటి నడి కొప్పు మీదకి ఒంగి— జాబిల్లి ముద్దుగా చేతికి అందుతుంది. అలాంటి మనోహర

మైన కలల లోయల్లోకి శాంతియాత్ర చేద్దామని కవికి అంత రాత్మ ఉద్బోధిస్తోంది. ఈ భావ చిత్రాలలో ఒక బాల్య చాపల్యపు మాధుర్యం (Nostalgia) మెరుస్తుంది.

శ్రీ శేషేంద్రశర్మ వినూత్న కవితాప్రయోగంగా, పద చిత్ర ప్రధాన సంవిధానంతో వెలువర్చిన మండేసూర్యుడు ఒక శక్తివంతమైన ధ్వనిగా తెలుగునేలలో అశేష ప్రకంపనాలకు అవ కాశమిచ్చింది. ధ్వని శక్తివంతమైనపుడు ప్రతిధ్వనులు అసం ఖ్యాకంగా ఉండడంలో అబ్బురమేమీలేదు. సాహిత్యంలో ఒక కవిస్థానాన్ని, అతని విశిష్టతను వివరిస్తున్నపుడు మిగతా కవులను తక్కువ చేయవలసిన అవసరం ఈ విమర్శకునికి లేదు. అలా అని ఒక విశిష్టవాణిని వివరించక పోవడమూ సాహిత్య విమర్శకు న్యాయం చెయ్యదు. ఆ కవి విశిష్టస్థానాన్ని బట్టి ఆ కంఠధ్వని లోని నవ్యత ననుసరించి సమకాలీన సాహిత్యంలో ప్రకంపనలు ఎలా కలిగాయో సోదాహరణంగా చూపడం ఇతర కవులను కించపరచడం కాదు. T.S. Eliot చెప్పినట్లుగా అచ్చమైన స్వయం వ్యక్తిత్వం అనేదే ఆరాధ్యమయితే ఆదిమత్వానికి (aboriginal) పోవలసిందే. కనక సమకాలీన సమిష్టిస్వరూపంలో ప్రతిధ్వనులు నిందార్హాలు కావు. ఈ మండేసూర్యుడు కొత్తగా కలం పట్టిన యువకవులలో అంఖ్యాక ప్రతిధ్వనులు కలిగించింది. అంతతో ఆగక పటిష్ఠులైన సోదరకవులను కూడ ప్రభావితం చేయ డం ఆ కావ్యంలో గల విశిష్ట విద్యుత్తేజానికి తార్కాణం. ఈ కవి ప్రభావం ఇతర యువ కవుల మీద ఎలా తన కాంతి రేఖల్ని

ప్రసరించిందీ గ్రంథారంభంలో కొంత వివరించాను. ఇక్కడ లబ్ధ ప్రతిష్ఠులపై ఆ కవి ప్రభావం ఎలా అభివ్యక్తమయిందీ వివరించవలసిఉంది. ఇది కేవలం విమర్శనాత్మక ప్రదర్శనకు మాత్రమే.

మండే సూర్యుడులో సంకలితమైన 'పోదాంపద' (పుట:19) అనే కవిత తొలిసారిగా ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో 27-3-74 తేదీ సంచికలో ప్రచురితమైంది. ఆ కవితతో పాటు మండేసూర్యుడు లోని శాంతి యాత్ర (పుట:37) అనే కవితలోని పదచిత్రాలూ తనకు ఆవేశించగా డాక్టర్. అరిపిరాల విశ్వం 'మళ్ళీ ఆ ఉదయం వైపు' అనే కవితలో ప్రతిధ్వనులు వాడు కున్నాడు:

'బైట ఆకాశం పిలుస్తోంది పద
చర్చిల శిఖరాలకు మల్లే పెరిగిన
ఆ యూకెలెప్టస్ అడవుల్లో పరుగెడదాం పద
ఎక్కడ కెంపులొలికే కెమిలియాలు నిశ్శబ్ద
మాధురిలో

నీలి నీలి కలలు కంటున్నాయో
ఎక్కడ చెట్లు యౌవనపు ఆకుల్ని
రాలుస్తున్నాయో
భూమి నాగరికతల్ని రాల్చినట్లు
ఆ యూకెలిప్టస్ అడవుల్లో పరుగెడదాం పద!—"
(శేషేంద్ర; పోదాంపద; పుట:19)

పైన పేర్కొన్న మళ్ళీ 'ఆ ఉదయం వైపు'లో డా॥ అరిపిరాల ఇలా అంటాడు:

'మరణంలా పరుచుకున్న మౌనపు మంచు మీద
మసక మసక జ్ఞాపకాల గుర్తుల్ని వదిలిపెడుతూ
ఆశ మనకిచ్చిన ఆఖరి కన్నీళ్ల నిక్కడే విడిచి
పాటల పల్లవిని లాగేసుకొని
వెలుగూ వెన్నెలా (?) ఒక్కటయ్యే చోటికి
వెళ్ళిపోదాం పద'

గొంతుజీరలోనూ, వాక్య నిర్మాణ పద్ధతిలోనూ పదచిత్రనిర్మాణంలోనూ, ఎంత దగ్గరపోలికో పాఠకులే గ్రహించగలరు.

'ఎక్కడ కొండల మండువాలో
భూమ్యాకాశాలు పెళ్ళిచేసుకుంటాయో
ఎక్కడ పేరులేని పక్షి
కొమ్మలో కూర్చున్నమాత్రాన
పరిసరాలు పద్యాలుగా మారుతాయో—
(శేషేంద్ర 'శాంతియాత్ర' పుట 40,41)

అన్న పై వాక్యాల ప్రభావంతో డా. అరిపిరాల ఈ విధంగా ప్రతిధ్వనిస్తున్నాడు.

"ఆకాశం భూమితో గుసగుసలాడే చోటికి
సెలయేళ్ళ నృత్యంలో సరిగమలేరుకుంటుంది
చీకటిచిప్పలో వెన్నెల ముత్యాలు సేకరిస్తుంది."

ఈ పదచిత్రాల నిర్మాణంలో శ్రీ శేషేంద్ర ప్రభావం నేపథ్యంగా ఎలా అమరుతున్నదో ఈ క్రింది వాక్యాలు పరిశీలిస్తే తెలుస్తుంది.

"మత్తెక్కిన కొండల గుండెలమీద గంతులేస్తున్న
ఆ మబ్బుల త్రాగుబోతుల్లో కలుద్దాం పద
పొలాల్లో రాలిన చెమట బిందువుల్ని
ధాన్యపు ముత్యాలుగా మార్చి
భూమిగాయాల్ని మాన్పుదాం పద!"
(శేషేంద్ర: 'పోదాంపద'లోనే)

ఒక కవి ప్రభావం సమకాలీనులైన ఇతరేతర కవులపై ప్రసరించడంలో విడ్డూరంలేదు. కాని అలా ఇతరుల ప్రభానికి లోనైన కవులు బుద్ధిపూర్వకంగా అలాంటి ప్రభావచ్ఛాయలను వైదొలగించుకోవాలి. లేకపోతే వారి కవిత్వం 'సెకండ్ రేట్' అయిపోయే ప్రమాదముంది. ఇటీవలి కవితలలో బుద్ధిపూర్వకంగా తొలగించుకుందుకు శ్రీ విశ్వం ప్రయత్నిస్తున్నట్లు కనబడటంలేదు.

మరీ విడ్డూరమైన సంగతి మరోటి మనవి చేస్తాను. 'ఎండల జెండాలు' అనే శేషేంద్రకవిత 'మండే సూర్యుడు' (పుట: 70)లో సంకలితమైంది. అందులో ఈ పంక్తులు చాలా చాలా ప్రఖ్యాతమయ్యాయి.

ఎన్నాళ్ళో పెంచి
పోగుచేసిన వాళ్ళు
ఎండల తలపాగాలతో
వెళ్ళిపోతూఉంటే
మిలియన్ల గొంతులెత్తి
ఏడుస్తున్నవి ధాన్యపురాసులు

అనడమేకాక, ఈ ధాన్యప్రసక్తి మరో కవిత 'బిందువు. సింధువు' (పుట : 81) లో కూడా ఇలా తెస్తాడు :

కాని తల్లీ
మీ పొలాల్లో
ధాన్యం కూలీలకోసం
ఏడుస్తోంది.

అనే పై రెండు కవితలలోని పదచిత్రాలు ఒక ప్రభావరేఖ పెనగి, డా॥ నారాయణరెడ్డి గళంలో సుళ్ళు తిరిగి, మన పురాణ కథా స్పర్శతో రూపారోపణ పొంది (Allegory) ఇలా ప్రకటిత మైంది; 'ఎక్కడున్నావు మానవతా' అనే కవితలో :

ధాన్య జానకిని చెరపట్టిన
దశకంఠుల విషలంకల
అట్టడుగు గర్భగుహల్లో
ఇరుక్కున్నావా ? . . .

అంటూ సాగిన ఈ కవితలో ధాన్య ప్రసక్తి రావడం ఒక కవి ప్రభావానికి తార్కాణగా చూపడమే విమర్శకాదు. ఒక కవి వాడిన పదచిత్రాల ఉనికిపట్లు ఎక్కడున్నాయో వెతికి చూపడమే విమర్శ. తద్వారా ఒక కవి ప్రయుక్తంచేసిన అభివ్యక్తి మౌలికమూకాదా అన్న విచారణే విమర్శకు ప్రమేయం. వేరొకడి ప్రభావం అది ఎంత గొప్పదయినా మరొకని కవితలోకి చొచ్చుకున్నదంటే దాని మౌలికతను భ్రష్టం చేస్తుందనడానికి George Santayana వంటి తాత్త్వికుడు ఇలా సాక్ష్యం పలుకుతున్నాడు : "To the thought a verbal expression that others may be able to decifer it and to be stirred by it as by a wind of suggestion sweeping the whole forest of their memories కనుకనే సమకాలీన కవులు మరింత జాగ్రత్త వహించి ఇతరేతర ఝంఝూమారుతాల ఒత్తిడినుంచి తమ నందన వనాల్ని కాపాడుకోవాలి. అప్పుడే మౌలికత ఆవిష్కృతమవుతుంది.

— —

ఏడవ ప్రకరణము :

# తెలుగు కవితా రంగంలో ఆధునికతకు గడుసరి ప్రతినిధి 'ముం దేసూర్యుడు'

'నాదేశం వెన్నెముక' అనే కవితలో వర్తమాన మానవ జాతి కలలు, గమ్యాలు శక్తివంతంగా చిత్రించబడ్డాయి. 'కాగితాలపడవల్లో కలలు ప్రయాణంచేస్తున్నా'యన్న ప్రారంభ వాక్యమే మన హృదయాలను అరికడుతుంది. ఊహాలోకాలలో ఎక్కడెక్కడికో తీసుకుపోతుంది. కవి సంతత బాలచేతస్కుడై చిత్రవిచిత్రంగా ఊహాలు పన్నుతాడు. రిల్కే మహాకవి చెప్పినట్లుగా "To be alone in great inner solitude as if he was alone in childhood" ఆర్ద్రమైన బాల హృదయంతో ఆశలు పేరుస్తాడీకవి. కలలు అల్లుతాడు వాటినన్నిటినీ కవితల రూపంలోకి మార్చి కాగితం పడవలకెక్కిస్తాడు. వాటిని కాల వాహినీ తరంగాలలో వదులుతూ ఆనందిస్తాడు. ఆ పడవలలో ఎన్ని నిరవధికంగా పయనిస్తాయో, ఎన్ని అవతలి తీరానికి చేరుకుంటాయో, ఎన్ని తృటిలోనే చిటిలిపోతాయో - అతనికి పట్టదు. కాగితం పడవలలో కలలను బట్వాడా చేయడంవరకే తన పని. తరువాత బాధ్యత తనదికాదు

వర్తమాన కవుల కలల పడవలు భవిష్యత్తు వైపుగానే ప్రయాణంచేస్తున్నాయి. రేపటి లోకాన్ని కవితాపరంగా నేటి లోనే ఆవిష్కరిస్తున్నాయి. అలా చేయగలిగినవాడే ఆధునిక కవి. వాడు ఏకాలానికి చెందినా ఏ దేశానికి చెందినా ఏక దేశం గానే సాక్షాత్కరిస్తాడు. వర్తమానకాలంలో బ్రతుకుతూ, ఈ కాలం సమకూర్చిన సర్వభోగాలూ అనుభవిస్తూ సిగ్గువిడిచి ఈ కాలం సాధించిన విజయాలను తదధీనంగా బ్రతికే ఈ లోకాన్ని నిందిస్తూ గతాన్ని గురించి కలలుగనేవాళ్ళు ఆధునికులెంత మాత్రం కాలేరు—పొరపాటున వర్తమానకాలంలో పుట్టిన ప్రాచీనులు. వారు నేటి సుందర మస్తకంపై మృతగతాన్ని కప్పజూస్తారు. వర్తమాన జీవితాన్ని పురాణమతానికి పూన్చ ప్రయత్నిస్తారు. అలాంటివారు సాహిత్యంలో విశ్వనాధలైనా, రాజకీయాలలో వాజ్ పేయిలయినా తిరస్కరణీయులే.

ఇదే భావాన్ని ఈ కవి సుందరమైన ప్రతీకలద్వారా అపూర్వ పదచిత్రాలద్వారా అభివ్యక్తం చేస్తున్నాడు. ఎంత తీవ్ర భావాన్ని చెప్పవలసివచ్చినా, వర్తమాన విషమ వ్యవస్థపై ఎంత ఆక్రోశాన్ని వెళ్ళగ్రక్కవలసివచ్చినా—ఎక్కడా తాను కవినన్న చైతన్యం వదిలిపెట్టడు. ఏభావాన్నీ పచ్చిగా వాచ్యం చెయ్యడు—కాగితం పడవల్లో కలలు ప్రయాణం చేస్తున్నాయి. సముద్రాల రస్తాలో అవి తమ జెండాలెగురేస్తున్నాయి. కాలపు రేవులు దాటి గమ్యాన్ని చేరుకున్నాయి. కాలం ఎక్కడికక్కడే

రేవుల్ని ఏర్పాటుచేసి ఈ పడవల్ని ఆపడానికి ప్రయత్నిస్తుంది. కాని అవి ఆగడంలేదు. గమ్యాన్ని చేరుతున్నాయి.

'మట్టిని ధాన్యంగా మార్చే
వట్టి పొగని నాగరికతగా వడికే
ఆ ఎదురులేని ప్రజాశక్తి
ఇతిహాసం పాడుతూ
సూర్యమండలాన్ని కడుపుతో ఉన్న
సుందరదిశవైపు పోతున్నాయి.

ప్రతి పదంలోనూ ఒక నవశక్తిని ఘట్టించి వదిలాడు కవి. "Each word charged with new meaning and new life" అని ఎజ్రాపౌండు చెప్పిన దానికిదే అర్థం. ఉత్తమట్టిని చెమటతో తడిపి, క్రుమ్మిఆరుగాలం ప్రకృతితో పోరాడి ధాన్యంగా మారుస్తాడు కృషీవలుడు ఫ్యాక్టరీలు ఆకాశంలో పొగచిమ్మడమే కనిపిస్తుంది స్థూలదృష్టికి దానికడుపులో చేరిన కార్మికులుఅనవరత పరిశ్రమాఖిన్నులై స్విన్నులై ఆ వట్టి పొగనుంచి నాగరికతను వడికి మనకందిస్తున్న సంగతి మన స్థూలదృష్టికి తెలియదు. పొగనే కేవలం నిర్గుణమైన పొగనే, సగుణమైన దూదిగా మార్చి దారాన్ని తీసి వస్త్రాలుగాచేసి, లోకాన్ని నాగరీకం చేస్తున్నారు కార్మికులు. తిండీ, బట్టా ఉత్పత్తి సాధనాలద్వారానే మానవజాతి నాగరికతను అంచీలవారిగా ముందుకు తీసుకపోయిందని మార్క్సు మహాశయుడు అందుకనే అన్నాడు అట్టి

ఉత్తమ సాధకులంతా కలసి ఎదురులేని ప్రజాశక్తిగా రూపొందుతారు. వారి ఇతిహాసాన్ని కీర్తిస్తూ కాగితం పడవలెక్కిన కలలు దిగంతాలవరకూ ప్రయాణం చేస్తాయి. సూర్యమండలాన్ని కడుపుతో ఉన్న సుందరదిశగా పోతాయవి. దిశకు సుందర విశేణము లగించడంతోనే గర్భవతి అయిన సుందరాంగి మన మనస్సులో నిలుస్తుంది.

'వంగిపోతున్న దేశానికి
నింగిఎత్తు వెన్నెముక
నిర్మించే పండుగలో పాల్గొంటున్నాయి

దేశం క్షణక్షణం వంగిపోతూ ఉంటుంది. నింగి అంత ఎత్తయిన వెన్నెముక దాన్ని పైకి లేవదీస్తుంది. అలాంటి వెన్నెముక నమర్చడం దేశానికి జరిగే నిజమైన పండుగ. ఆ పండుగలో ఈ కలలు పాల్గొనడానికి ప్రయాణం సాగిస్తున్నాయి. ఈ కలల ఆశయం ఏమిటి ? "జాతి బాహువులకు కండరాలు కావాలని" జాతిబాహువులంటే నే శ్రమజీవులు. వారికి కండరాల పుష్టిని ఈ కలలు కలిగిస్తాయి. వారి ఉద్యమోత్సాహానికి ఈ కలలు ప్రేరణలై నిలుస్తాయి. జాతి ఛాతీకి ఇరువైపులా బలంలా, అందంగా నిలుస్తాయి. అందుకోసం పడవలెక్కి పరుగులు తీస్తున్నాయి కలలు.

ఈ కలలున్నాయే–ఇవి నిర్గుణసామగ్రికాదు. శరీరమూ, రక్తమూగల సగుణ పదార్థాలు. వాటి నాళాల్లో ప్రవహిస్తు

న్నది కేవలం రక్తంకాదు : రేపటి మానవులకోసం నిన్ననే తమ సర్వస్వాన్ని త్యాగంచేసి బలిదానం చేసిన అమరవీరుల ప్రాణాలు, ఈ కలల నాళాల్లో ప్రవహిస్తున్నాయి. గుండెల్లో మ్రోగుతున్నాయి. 'ఎవరి గుండెల ఉయ్యాలల్లోనో' కేరింత లాడిన శిశువులు పూవులుగా మారి వారి సమాధులపై రాల డానికి గాలితో కలిసి పోతున్నాయి. ఆ ప్రయత్నాలకు కలలు చేదోడువాదోడుగా నిలుస్తున్నాయి.

ఈ కవితనిండా పదచిత్రాలు తిరునాళ్ళవలె క్రిక్కిరిసి తోసుకుంటూ సాగుతాయి. ప్రతి అక్షరంలోనూ కవి వాక్కు లోని Self-assertion Self - Confidence (ఆత్మశక్తినిర్ధా రణ, ఆత్మవిశ్వాసము)లు గంభీర కంఠనిధ్వని తాలుస్తాయి.

'కోల్పోయిన ముఖము' అనే మరో చమత్కార కవిత తల వాల్చుకుని తొందరగాపోయే పాఠకుడ్ని పిలిచి గొప్ప ఆతిధ్యమిచ్చి పంపుతుంది :— హేమంత చంద్రుడు మంచుల జడికి పడ్చిపడ్చి కృశించాడట. చలికి ముడుచుకుపోయి గోడల్లో ఇటుకలు నిద్రపోతున్నాయి. వీధిలాంతర్లు చలిలో నిలవలేక కాళ్ళు కొంకిర్లై ఆవులిస్తున్నాయి. అట్టి సమయంలో కవి ఏంచేస్తున్నాడు ? దూరపు నక్షత్రాన్ని తదేకధ్యానంగా చూస్తు న్నాడు కాని ఆ విషయాన్ని అలాగే Paper report లాగో Statement లాగో కవి చెప్పడు. ఆ నక్షత్రాన్ని గెడ్డపార

లాగో, పొరలాగో ప్రయోగిస్తూ అంతరాత్మ ఇరుకుల్లో తవ్వుకుంటూ ఒక రహస్యాన్ని వెతుక్కుంటూ పోతున్నాడు. అలా తవ్వగా తవ్వగా ఎన్నో కోట్ల రాత్రుల చీకట్లు పేరుకున్న అట్టడుగుపొరల్లో ఆ రహస్యం బయట పడింది. ఏమిటా రహస్యం ? మనిషి కోల్పోయిన ముఖం ! అది వేయికిరణాలతో బయటబడింది. అప్పుడా ముఖంతో కవి అంటున్నాడు, "మా నరనరాల్లో రక్తమై ప్రవహిస్తున్న నీ కాంతి మండలం నీవీ అడుగుపొరల్లో నిద్రిస్తున్నా ఆగదు. పద ! నాతో కలసి రావయ్యా. మా ఉదయ రేఖాశిఖరాల్ని అధిరోహించు. మన మిద్దరం ఒకే ఎర్రని తామరపువ్వు పంచుకుందాం"...ఈ లోకం వేయిరేకులతో మెరిసే ఎర్రని తామరపువ్వు. ఇది ఏ ఒక్కడి సొమ్మూకాదు. పంచుకోవలసినవి. తవ్వినంతసేపూ కవికి గడ్డపారగా ఉపయుక్తమైన నక్షత్రం-రెక్కలువచ్చిన పిట్టలా చెట్ల కొమ్మల్లోకి పారిపోయింది. అంటే నక్షత్రగమనంలో చెట్ల కొమ్మలు అడ్డంవచ్చాయి. నక్షత్రాన్నిచూస్తూ కవి సల్పుతున్న ధ్యానంలో ఆదమానవుడు కోల్పోయిన ముఖం దర్శనమిచ్చింది. ఆ ధ్యానానికి ఈ నక్షత్రమే ప్రేరణగా సహకరించింది. ఆలోచనలు జలలా ఊరాయి. (Welled). ఈ చైతన్యం కవికి కలగగానే లోకమంతా జడత్వాన్ని వీడి చైతన్యజ్వాలా సదృశమవుతోంది. ఈ సత్యాన్ని ఈ కవి కవితా పరిభాషలో ఇలా వివవివరిస్తున్నాడు.

వీధి లాంతర్లలో జ్వాలలు
వీధుల్లోకి దూకాయి
ఇటుకలు నిద్రలేచి
ఇళ్ళు కూలదోశాయి

గోడల్లో దాగిన ఇటుకలు గృహభారాన్నంతా మోసి సొమ్మ సిల్లినవల్లా నిద్రలేచి వళ్ళు విరుచుకున్నాయి. దానితో గోడలు కంపించాయి. ఇళ్ళు కూలనారంభించాయి. ఇంతబరువునీ ఎంత కాలమని మోస్తాయి పాపమవి. ఈ ఇటుకలు దేనికి ప్రతీకగా నిలిచాయో వివరించనక్కరలేదు. దీనితో పాతలోకం కూలి పోయింది. కొత్తలోకం ఆవిష్కృతమయింది. నింగినుంచి క్రిందికి దూకాడు చంద్రుడు. అందరికీ వెన్నెల పంచిపెట్టాడు. మనిషి అమరుడవుతున్నాడు.

ఈ కవిత చదువుతూ ఉంటె ఎందుకో నాకు మనస్సు లోపలి పొరల్లో పాబ్లోనెరూడా రచించిన మహాకావ్యం 'మచ్చు బిచ్చు'లోని అద్భుతభావన, కరుణార్ద్ర సన్నివేశమూ, పచార్లు చేయనారంభించాయి అలా అని మచ్చూ బిచ్చూ కవితకూ, దీనికీ ఏమీ పోలికలేదు. కాని ఆ కవితను హృదయస్థం చేసుకున్న పదోసంస్కారభూమిక ఈ కవికి రక్తనిష్ఠమై ఉంటుంది. బహుశా ఆకారణంవల్ల నేనో హృదయానికి ఆ అనుభూతి ప్రతిబింబించింది. శ్రీ శేషేంద్ర కవితలో సాంద్రతరంగా దర్శనమిచ్చే ప్రతీకలూ పదచిత్రాలూ మౌన వ్యాఖ్యాత హృదయంలో పురివిప్పుకొని మెరుస్తున్న సమయంలో C. M. Bowra చెప్పిన ఒక వాక్యం

జ్ఞప్తికి వస్తోంది: "The symbolists paid much attention to this and exclude anything rhetorical or didactic or ethical on the grounds that it was necessarily unpoetical". సరిగ్గా అలాగే ఈ కవి తనలో మరిగే భావో ద్రేకాన్ని పేలవంగా శుష్కబోధకుడుగా ఉద్ఘాటించడు. ప్రతీకల ద్వారా పదచిత్రాలద్వారా, పఠితమనసులో రసభావోద్రేకాలు కలిగే సంవిధానాన్ని సిద్ధింపచేస్తాడు. అంటే ఇతని పద్ధతిని (Vocative method) అని మనం పిలుచుకోవచ్చు. కనుకనే ప్రతీకవాదం (Symbolism) కవిత్వంలో ప్రయుక్తం కావడానికి చిరంతన ప్రయోజనముంది. ప్రతీకలద్వారా పాఠకుని సుప్త చేతనలో నిశ్చేతనంగా పడిఉన్న రసభావాల్ని మేల్కొలిపి హృదయోపరితలానికి అనుభూతులను సముద్ధరించగలుగుతుంది. ఈ విషయాన్ని ఒక అనుభవశాలి ఇలా వివరిస్తున్నాడు :- "Symbolism was an attempt to evoke the subconcious element of life to set vibrating the infinite within us" అలాంటి అనంత ప్రకంపనలను కలిగించే సాధనగా ప్రతీక ఉత్తమ కవితకు ఉపయుక్తమవుతుంది. అలాంటిదాన్ని కవితా సంవిధానంలో స్వీకరించడం దోషమేమీకాదు. ప్రతీకలైనా పదచిత్రాలైనా, వాటంతటవిగా కవిత్వం కాలేవు. కవిత్వమనే సమగ్రశిల్పానికి-కళామూర్తికి అవి ఉపాంగాలై జీవన ధాతువులవుతాయి. రసికుడు కోరుకోవలసింది కావ్యాత్మ సాక్షాత్కారం. దానికై కవి ఎన్నుకున్న సంవిధానం వ్యంజనా సామగ్రి ఎలాంటిదయినా పేచీ ఉండదు. ఈ కవితలో కోల్పో

యిన ముఖం, హేమంత చంద్రుడు, నిద్రపోతున్న ఇటుకలు, వీధిలాంతర్లు, దూరపు నక్షత్రం, గడ్డపార, వంటి పదచిత్రాలన్నీ ప్రతీకలుగా ప్రయుక్తమై ప్రధాన కావ్యభావావిష్కరణకు పోషక మయ్యాయి.

'పువ్వులూ, నిశ్శబ్దాలూ' అనే కవితలో శేషేంద్ర ఇలా అంటున్నాడు :

చీకటీ నిశ్శబ్దమూ పెనవేసుకున్న
ఈ అద్వైతంలో నిద్రలేస్తోంది నామనసు
... ... ... ... ...
ఫుట్ పాత్ మీద కూర్చొని కన్నుల్లో కలల్ని
గిన్నెల్లో హిమలేహ్యంలా చెంచాల
చుంచువులతో ఆస్వాదిస్తున్నాను.

ఈ కవిత ఆధునిక కవితల్లో కూడా ఒకవిభిన్న సాంప్రదాయాన్ని తనకు తానుగా ప్రతిష్ఠించుకుంటోంది. ఈ కవితలో పాదాల మధ్యలో వాక్యాలు పూర్తయి క్రొత్తవాక్యాలు ప్రారంభమవుతాయి. ప్రతి పాదంలోనూ పదచిత్రాలు అనేకమై పాఠక హృదయానికి ఉత్తుంగ లంఘనం కలిగించే సంవిధానం తెలుగు కవితకింకా కొత్త దినుసు. ఇందులో పంక్చ్యువేషన్ మార్కులుకూడా తొలగించిఉంటే మరింత నూత్న శక్తివచ్చేది. ఫుట్ పాత్ మీద కూర్చున్న నిర్భాగ్యుడు తన కన్నులలోని కలల్ని గిన్నెల్లోకి ఒంపుకుని హిమలేహ్యంగా భావించి చెంచాల

చుంచువులతో తింటున్నాడు. ఐస్ క్రీమ్‌కి ఈ కవి చక్కని పదాన్ని సృష్టించాడు.(హిమలేహ్యం) పెనవేసుకున్న అద్వైతం చెంచాల చుంచువులు, అనే పదచిత్రాలు నవీన భావస్ఫోరకాలుగా ఉండి ఒకశృంగార రసాన్ని అవగుంఠనంచేసి ఆస్వాదయోగ్యంగా ఆప్యాయత కలిగిస్తున్నాయి. ఈ కవితను ఎవరికివారుగా నిశ్శబ్దంగా భావన చేయడంలోనే ఎంతోరమ్యత సిద్ధిస్తుంది.

'ఎండలజెండాలు' అనే తరువాతి కవితలో భగ్గున మండే గగనంలో విప్లవతుఫాను నడుపుతుంది. జెండాల ఊరేగింపును భావనచేస్తాడీకవి. "వేదంలా ప్రవహించే స్వేదంలో మృగత్వం పిండి ఎండలమీద ఆరవేశాము"

అన్నపుడుమాత్రం ఆరుద్ర జ్ఞాపకం వస్తాడు. అతను వేదంలా గోదావరి ప్రవహిస్తోందే తల్లి" అన్నాడు. ఒక కవిని చదువుతున్నపుడు వేరొక కవి జ్ఞాపకం రావడం కొంత రసభంగమే కలిగిస్తుంది. కాని ఇక్కడ వేదం వేతృత్వం, జ్ఞానం అనే అర్థంలో కవి వాడుతున్నాడు. మన జ్ఞానంలో మన ప్రయాశక్తిని తడిపి అందుదాగిఉన్న మలిన మృగత్వాన్ని పిండివేసి స్వచ్ఛమైన ఎండలమీద ఆరవేశామని ఎంతో ఉదాత్తభావనను ఈ కవి ప్రతిష్ఠిస్తున్నాడు. కాని ఆరుద్ర వేదప్రసక్తి గోదావరి పౌరాతన్యానికి మాత్రమే స్ఫోరకత్వం. మానవునిలో మృగత్వం త్రికాలంగా ఆవాసం చేస్తోంది. దాన్ని అనుస్యూతంగా ప్రవహిస్తున్న మనస్వేదంద్వారా పిండి అవతలకు నెట్టివేసి స్వచ్ఛ

మైన వస్త్రాలవంటి శరీరాలని ఎండలమీద ఆరవేస్తున్నట్లు శ్రామికుల జీవితాలు కణకణలాడే సూర్యరశ్మిలో స్వచ్ఛంగా భాసిస్తున్నాయని కవి భావిస్తున్నాడు. ఎన్నాళ్ళో పెంచి ధాన్యాన్ని పోగుచేసిన వాళ్ళు ఎర్రని ఎండల తలపాగాలతో శూన్యహస్తాలతో వెళిపోతూ ఉంటే ధాన్యపురాసులు మిలియన్ల గొంతులెత్తి ఏడుస్తున్నాయి. ఆరు నెలలుగా కష్టపడి పెంచి పోగుచేసిన ధాన్యపురాశుల్ని అప్పులవాళ్ళో ఈనాందారులో రైతునుంచి గుంజి తీసుకుపోతున్నారు. రైతుగుండె కోటి గొంతులతో ఏడుస్తుంది. ఇది లోకవాస్తవికత. రైతుకోసం ఆ ధాన్యమే ఏడుస్తుందని చెప్పడమే వక్రోక్తి. ఇదే కవితలో సౌందర్యసిద్ధి. ఇలాంటి మనోహర అభివ్యక్తులు చదువరి సంచేంద్రియాలను ఏదో మాయాజాలంతో కట్టి ఒక ఐంద్రజాలిక స్ఫూర్తిని కలిగించడం క్షేమేంద్రకవి సాధించిన సంవిధానం.

తరువాత పరిగణనీయమైన కవిత 'నక్షత్రబిందువులు' అనేది. దానిలో పరిమళాలు కూడా గాలి ఊచలు పట్టుకొని ప్రయాణంచేస్తాయి. గాలి వీచి తరువాత వీచిగా వెళ్ళిపోతూ ఉంటేలోపల సీటుదొరకని పరిమళాలు నగరంలో బస్సుప్రయాణీకుల్లాగ ఊచలు పట్టుకునే ప్రయాణం చేయవలసి వస్తుంది. లేక బహువిధ దుర్గంధాలతో నిండిన గాలి కడుపులోనికి పరిమళాలు ప్రవేశిస్తే తమఅస్తిత్వాన్ని కోల్పోతాయేమోనని వాటికి భయమయినా కలిగి ఉండవచ్చు.

'అకలి' అనే కవితలోకూడా ఇలాంటి మనోజ్ఞభావ చిత్రాలెన్నో ఉన్నాయి :

'రోజూ నన్నుతిని గ్లాసెడు నా చెమటతాగి
త్రేన్చేవాడు
నున్నగా టమాటాపండులాఉన్నాడు
... ... ... ...

వాడ్నితిని సముద్రాన్ని గటగట తాగివేస్తా, శ్రామికుల నిత్యజీవితాన్ని దోపిడీచేసే దొరలు నిశ్చింతగా ఉన్నారు. వాళ్ళ మొహాలు టమాటా పళ్ళలా ఉబ్బిమెరుస్తున్నాయి. వాళ్ళు రోజూ తినేది శ్రమజీవుల్నే. వాళ్ళు తాగేది శ్రామికుల చెమటనే. అంటే కార్మికుల శ్రమశక్తినుంచి సకల భాగ్య భోగాలూ ఉత్పత్తికాగా వాటిపై పెత్తనంచేసే వాళ్ళు తమ అవసరాల గడుపుకుంటున్నారన్నది యథార్థం. నిజాన్ని నిజంలా వ్యక్తంచెయ్యడం కవి పనికాదు. తాత్త్వికుని పని, రాజకీయవాది పని. కవి ఆ జీవన సత్యాలను ధ్వనిపూరితంగా చెప్పాలి అలా శ్రామికుల్ని దోపిడీచేస్తున్న వాళ్ళమీద సామాజికులతోపాటు కవికీ కోపం ఉంటుంది. ఆ కోపాన్ని బూతులతో అభివ్యక్తం చేస్తే కవిత్వం అవదు. శ్రామికుల పక్షాన నిలిచిన కవికి సముద్రాన్ని త్రాగితే తప్ప తీరనంత దాహముంది. తిమింగిల మంత ఆకలి ఉంది. కనకనే దోపిడీ దారుల్ని తిని సముద్రాన్ని గటగటా తాగితే తప్ప తృప్తికలగదు. అనంత శ్రామికసందోహాల ఆక్రోశాన్ని కవి అలా ప్రతిధ్వనిస్తాడు.

'చీకటి తుఫాను' అనే కవితలో - నీమెడలో సూర్య మండలాల్లాటి స్వేదబిందువులు' అనినప్పుడుకూడా కార్మికుణ్ణి నిత్యం మండే సూర్యుడితో పోల్చిచూపుతున్నాడన్నదే గోచర మవుతుంది. శ్రామికుని గళసీమలో కాంతివలయంవంటి స్వేద బిందువులు మెరుస్తూ ఉంటాయి.

'బిందువు సింధువు' అనే కవిత ఒక కరుణాత్మక జీవన చిత్రం. గ్రంథ విస్తరణభీతితో నా వ్యాఖ్యానాన్ని ఎంత క్లుప్తీ కరిద్దామనుకున్నా సాధ్యంకాని పరిస్థితి ఎదురవుతోంది. 'నీ మట్టితో చేసిన బొమ్మని ... నీ గాలితో ఊపిరిపీల్చుకునే జీవిని నీ కమ్మని పలుకులు చిలకలై నాకొమ్మల్లో పాటలుపాడే తోటని ... ఈ మట్టే మానవుని బొమ్మగా మారి ఈగాలి అతని ఊపిరై సంచలించింది. కమ్మని పలుకులు చిలకలయ్యాయి. కొమ్మల్లో పాటలు పాడాయి. సమాజమే తోటగా మారింది. ఆ తోటే కవిహృదయం. పొలాల పొదుగులు పితికి పెంచిన తనువీజాతిది. కేదారాలు కామధేనువుల్లా క్షీరాలనిస్తున్నాయి. వాటితో ఈ తనువులు పెరుగుతున్నాయి. ఆ భూమాతకోసం తమ ప్రాణాలను బాణాలుగా వదిలేధనువులవంటివీ తనువులు. ధాన్యం కూలీలకోసం ఏడుస్తుంది. గుండెకన్నీటికోసం ఏడుస్తుంది భూమిని సంబోధిస్తూ కవి : "తల్లీ నీవెప్పుడు నాకు పట్టెడు మెతుకులు పెడతావో, ఒక నిజమైనకథ చెపతావో, యెదలో చోటిచ్చి నిదరపోంమంటావో''అంటూ ఒక ఆత్మీయతాభావాన్ని ఉచ్ఛ్రలిస్తూ ఆక్రోశిస్తాడు. అమెపాటలు పక్షులై, ఆకాశంలో

విహరిస్తాయి. అతని దుఃఖిత హృదయాన్ని ఊరడిస్తాయి. ఆమె నవ్వులు పువ్వులై వికసిస్తాయి. ఆమె ఎండలు జెండాలై గగంతాల్లో ఎగురుతాయి. అప్పుడు కవి తానొక కన్నీటిబిందువై మానవతా సముద్రంలో కలిసిపోతాడు.

'వాన' అనే తరువాతి కవితలో 'వర్షం వేయిచేతులతో తన తలుపు కొడుతోంది' అంటాడు. వర్షం కుపితుడైన కార్తవీర్యార్జునిడిలా వేయిచేతులతో దండెత్తుతోందని ధ్వని. 'వీధిలో రౌడీగాలిచేతుల్లో కొమ్మలు విలవిలా కొట్టుకుంటున్నాయి. ఈ వాన ఎంతదూరాన్నుంచో వచ్చి ఏవో సందేశాలు చెపుతోంది. తనపని పూర్తిచేసుకుని వర్షం మబ్బులరథాలెక్కి వెళ్ళిపోయింది. సూర్యుడు వెంటనే బయలుదేరాడు, నాగలి భుజానవేసుకుని, కొండశిఖరాలమీద దుక్కి దున్నడానికి వెళుతున్నాడు భూమిలో దాగిఉన్న చిన్నారిగింజ మెడబయటికిపెట్టి మొదటవచ్చిన రెండాకుల్ని చేతులగా జోడించి కృతజ్ఞత చెప్తోంది- జలదానం చేసిన మేఘాలకి జోహార్లర్పిస్తుంది. వర్షాధిదేవతకి ఓహో ఎంత రమణీయార్థప్రతిపాదకం! సహృదయ పాఠకుడు ఎక్కడ ఒక చిన్నారిమొక్క మట్టిని చీల్చుకుని రెండాకుల్ని పైకెత్తుకుని వెలికుబకడం చూసినా ఈ కవితోక్తిని చటుక్కున జ్ఞాపకం చేసుకుంటాడు. ఒక్కసారి చదివిన పాఠకుడు జీవితాంతం మరచిపోని అనుభూతి పారమ్యత కవిత్వం కలిగించడమంటే ఇదే.

'సముద్రాలు నీ చీరలు' అనే గీతం కవితాప్రియుంవదకు కవి సమర్పించిన నీరాజనం. ఆమె అతనికి కవిత్వం నేర్పింది.

అతని గుండెలలోయల్లోకి ఆమెభాష జలపాతంలా దూకింది. జలపాతం నిర్మలోదకానికి ప్రతీక అది రసప్లావితం. గుండె లోయలు నింపిన జలపాతం నరనరాలల్లోనూ ప్రవహిస్తుంది. ఆమె పలుకులు తేనెటీగలై పూలవంటి కాగితాలలో ఊగుతాయి. పూలపై తేలుతాయి. కాగితాలు పూలవలె మృదువై నవనేకాని కాగితంపూలనికాదు, ఆమెవాక్యాలు కామాలు, ఫుల్‌స్టాపులూ లేని నదులై మానవమనస్సుల దుర్గమారణ్యాల చీల్చుకొని పరుగులెత్తుతాయి. 'వాక్యం రసాత్మకం కావ్యం రసాత్మక వాక్యం చీకటి కీకారణ్యాలలో ఉదయసూర్యుడిలా ప్రవేశిస్తుంది. జీవనదిలా ప్రవహిస్తుంది. హేమంతాలగుంపుని ఆకుల్లా పోగు జేస్తుంది అవి ఆమె రచించేకవితాపత్రాలు. ఆమె సహృదయ కరుణాసముద్ర. శ్రామికుల స్విన్నవదనాలకు ఆమెహృదయం జాలువారుతుంది.

"చెమట బొట్టుకు
నీ హృదయం కోల్పోతావు
చేతులనిండా
ధాన్యం నింపుతావు
సముద్రాలతో శరీరాన్ని
కప్పుకుంటావు
నాగరికతతో మానగ్నత
కప్పుతావు''

అన్న వాక్యాలద్వారా కవితా హృదయము మేదినితో సమాన మైనదని కవి ధ్వనిస్తున్నాడు. కృషీవలుల చెమటబొట్లకు తడిసిన భూమి తన హృదయాన్నే సమర్పిస్తుంది వారి చేతుల నిండా ధాన్యాన్ని నింపుతుంది. ఆమె తన శరీరాన్ని ఉప్పునీటి సముద్రాలతో కప్పుకుంటుంది; మానవుల నగ్నతని నాగరికతతో కప్పుతుంది. ధాన్యపురాశినేకాక దూదిమేట్లనూ ఆమె అందిస్తుంది. మనిషి పత్తిని బట్టలుగా మార్చుకుంటాడు. వస్త్రధారణలోనే నాగరికత తన తొలి విజయాన్ని చాటుకుంది. ఆమె గింజలు తింటుంది, పూలు గాలిలో ఉమ్మేస్తుంది. గింజలు నేలతల్లి కడుపులో దాగి తిరిగి మొక్కలుగా చేలుగా తోటలుగా అభివ్యక్తమవుతాయి. వికసించిన పువ్వు కాయగా మారేందుకు. నిన్నటివరకూ ఎంతో ఆప్యాయంగా అలంకరించుకున్న పూరేకులను నిర్దయగా గాలిలోకి వదులుతుంది. ఇంత భావాన్ని చెప్పడానికి కవి కుశలుడై అవలంబించిన పొదుపరితనం ప్రశంసనీయంగా భాసిస్తుంది. భూమి కవితారసహృదయిని కనక మేఘాలలో బంధించబడిన వానచినుకు ఆమె యెదలో చోటుకోసం తహతహలాడుతుంది

శ్రీ శేషేంద్ర అచ్ఛమైన కవితాహృదయంతో తెలుగు భాషకు చేకూర్చిన అతి నవీన కవితాలంకారాలకు మండే సూర్యుడు ఒక రత్న మంజూష. నేటి అంతర్జాతీయ కళా ప్రపంచంలో అతి నవీన సంవిధానవాదాలైన పదచిత్రవాదమూ (Imagism), ప్రతీకవాదమూ (Symbolism), అభివ్యక్తి

వాదమూ (Expressionism) వంటి సకల ధోరణులనూ చక్కగా ఆకళించుకున్నాడు. ఆధునిక యూరోపియన్, అమెరికన్ కవితా వాహినిలో తుణ్ణంగా జలకాలాడేడు. నేటి తెలుగుకవులలో కొందరీఆధునిక ధోరణులను జీర్ణం చేసుకోలేని అరిపేదలై అరిగీ అరగని అనుకరణలను దింపుతున్నారు. తమ కవితకు అనుకూలమైన అభివ్యక్తిధోరిణిని అలవర్చుకోలేక తికమక పడుతున్నారు. మాధుర్యగుణాన్ని స్వాధీనంచేసుకోలేక పోతున్నారు. తమదైన నుడికారాన్ని హ్రస్వలిపినీ, బాణీనీ, యాసనీ రూపొందించుకోలేకపోతున్నారు. ఇలాంటివారందరికీ శేషేంద్ర కవిత ఒక శక్తివంతమైన దీపస్తంభం. శక్తిరాహిత్యానికి ప్రతివాదం. మూర్తిమత్తులా ఆధునికత్వానికి తెలుగు కవితారంగంలో గడసరి ప్రతినిధి 'మండే సూర్యు'డే.

'ఫులుస్టాపు' అనే తరువాత కవితలో కవి తనకోరికనిలా ప్రకటిస్తున్నాడు : "నాముందొక కిటికీపెట్టు, దానిముందొక పచ్చలుమిసే పచ్చికనేల పరువు, దానిమీద పూలుకురిసే ఒక పొగడచెట్టు పెట్టు, దానిమీదికి కెంపులొలికే ఒకపూలతీగ అల్లు పెట్టు, దానిమీద ఒక రంగుల పద్యంలా సంచరించే సీతాకోక చిలుక వదిలిపెట్టు—అంతే..." ఈ స్వల్పమైనకోరిక సఫలమైతే చాలు కవి జీవితమే సార్ధకమై రసమయ వాక్యమై పరుగు లెత్తుకుపోతుంది. అక్కడ తన ఫులుస్టాపుతో కలుస్తుంది. వాక్య పరిపూర్ణతకు ఫుల్‌స్టాప్ సంకేతం. అదే దాని గమ్యం

కవితాకళాసౌందర్యానికి పాఠక హృదయ గమ్యం. అది కవి చెప్పదలుచుకున్న భావం.

'పడవలు' అనే కవిత హృదయంగమమయినది. మనిషి పడవలు నిర్మిస్తాడు. నాగరికత ఆరంభమైన దగ్గరనుండి చేస్తు న్నాడు. కవితాహృదయం కలవాడూ, పసితనపు పచ్చితనంపోని వాడూ చేసేపడవలు వేరు. వాటిని కలలతో కాగితాలతో చేస్తాడు. కాలవాహినిలో వదులుతాడు. నిశలతో, నిశ్శబ్దాలతో, చుక్క లతో, శూన్యాలతో, ఆ పడవలు నింపుతాడు. గుండెలతో గుస గుసలాడే గగనాల నీలిమ తెచ్చి ఆ పడవలకు రంగులు వేస్తాడు, బ్రతుకే తెరచాపగా వాటికి పరుస్తాడు. రకరకాల పడవల్ని రంగుల పడవల్ని చీకటి కెరటాలలోకి విడిచిపెట్టి నిష్క్రమించిగా వెళ్ళిపోతాడు. ఆ పడవలు యజమానిమీద ఎంతో భక్తిశ్రద్ధలు ప్రదర్శిస్తాయి. అతని నిట్టూర్పులు మోసుకుంటూ వెడతాయి. నిట్టూర్పు ఆనందానికీ ఆవేదనకి ప్రతీకయే. అలల కల్లోలాలు దాటుకుంటూ పోతాయవి ఎప్పుడో ఎక్కడో భానికాలాల దిగంతరేఖల చీల్చుకొని ఉదయించే ఉషస్తీరాలు చేరుకుంటాయి. అంతగొప్ప పడవలను నిర్మించిన మనిషి తన శరీరాన్ని ఇక్కడ ఇవతలి తీరంలో మట్టిలో కలుపుకుని ఆ ఉషస్తీరాల్లో వాటిని కలుసుకుందుకు కలలు కంటాడు. అప్పుడా తెరచాపలానం దిస్తాయి. మనిషి ఆశలు గమ్యానికి చేరాయన్న సంతోషంతో గాలులతో కలసి ఈలలు వేస్తాయి. కాగితం పడవలలో నిక్షిప్తం చేసిన కవి కలలు అవతలితీరంలో ఫలిస్తాయని కవి మనకు విశదం

చేయదలచుకున్నాడు. అవతలితీరం భవిష్యత్తుకు ప్రతీక. వర్తమానం కల్లోల సాగరం. దానినిండా హాహాకారాలు నిండాయి. దాన్ని అధఃకరించాలని సూచిస్తున్నాడు.

'వక్రరేఖలు' అనే కవితలో-గుండె గోడలమీద సముద్రం గీస్తున్న ఏవో గీతల్ని వర్ణిస్తున్నాడు. ఆ గీతలవల్ల గాయాలేర్పడుతున్నాయి. అవి కాంతిని స్రవిస్తున్నాయి. ఆ కాంతిలో జీవితాన్ని పుటలుగా తిరగేస్తున్నాడు. బయట ఆకాశం శోక భారంతో చుక్కలు రాలుస్తుంది. ఈచుక్కలు ఉదయ బిందువులూ కావచ్చు, నక్షత్రాలూ కావచ్చు. తీరంలో చంద్రుడు వెండిదుకూలాలు పరిచాడు. ఆ వెండితువ్వాలుమీద కవి పడుకున్నాడు. ఏతార ఏ రహస్యం చెప్తుందో విందామని నిరీక్షిస్తున్నాడు. చీకట్లో సంచరించే మిణుగురు పురుగు ఎగిరే వెలుతురులా ఉంది. కాని అంత వెన్నెట్లో మిణుగురు పురుగు గుడ్డిమెరుపులతో చీకటి ప్రయాణం చేస్తోంది. అలా ఎగురుతూ ఎగురుతూ ఆ వెలుతురు ఒక వాక్యాలమూట మరచిపోయింది. ఆ మరచిపోవడం స్మృతిలో మళ్ళీ మేలుకొలడానికి సంకేతమే !

'ఒక్కతార' అనే కవితలో 'రాత్రి నేనూ నాదిండూ కలిసి కనిన కలల్ని పగలు నేనూ నాకలం పంచుకుంటాం' అని చమత్కరిస్తాడు. ప్రతీరాత్రీ నిద్రకుపక్రమించేముందు కవి మనస్సు ఏవో కలలు కంటుంది కవితా చిత్రాలను కంటుంది, వాటిని స్మృతి తన భాండారంలో దాచుకుంటుంది. పగలు వాటిని

కవి కలానికందిస్తుంది. అలా పుడతాయి కావ్యాలు." నాకాళ్ళు సంకెళ్ళలో ఉన్నా, నా కలలు కొండలమీద సంచరిస్తాయి." నిజమే. భౌతికంగా ప్రతివాడూ కనిపించని కొన్ని సంకెళ్ళకు బంధితుడే కవి అంతే. కాని భావుకుని మనస్సు స్వచ్ఛందంగా క్షణంలో ఎక్కడికెక్కడికో విహరించగలదు. ఏ పర్వత శిఖరాల లోనో సంచరించగలదు. ఎన్నోభావాలను సంచీలకెత్తగలదు. కనకనే కవి తన కలలు కొండలమీద సంచరిస్తాయన్నాడు. "ఆకాశంమీద చంద్రుడు మబ్బుతునక వేలుపట్టుకుని నడిపించు కుంటూ పోతున్నాడు. ఈ పదచిత్రం ఎంత సజీవమైన భావ చిత్రాన్ని మన హృదయంలో నిలువుతున్నదో పరిశీలించండి. ధోవతీ ఉత్తరీయం వేసుకున్న ఒక నడివయస్కుడు తన కుమా రుణ్ణో, మనుమణ్ణో వేలుపట్టుకొని నడిపించుకుంటూ వెళ్ళే దృశ్యం మనమనో వీధిలో మెదులుతుంది. నిశ్శబ్దంగా వెన్నెల కురుస్తోంది, నిశ్చలంగా అడవి తడుస్తోంది. ఆ అడవిలో అతని జీవిక నిల్చొనిఉంది. అడవి లోకపు సంకీర్ణతలకు ప్రతీక. కవికి ఎన్నో కలలు వస్తాయి. ఆచరణయోగ్యమయినదొక్క కలచాలు ఈ ప్రపంచాన్ని వాసయోగ్యంగా మలుచుకుందుకు. కాని ఆ ప్రయత్నాలను సహస్రబాహువులెత్తి బెదిరించే సముద్రం సాగ నివ్వడంలేదు. ఇక్కడసముద్రం Vested Interests కుప్రతీక,కాని కవి నిరాశాహతుడవడంలేదు. నీలిమాకాశపులోతుల్లో ఎక్కడో ఒక తార మిణుకుమిణుకు మంటూ పిలుస్తోంది. అదే దిక్కూ తెన్నూ చూపే ధ్రువతార. ప్రతీకవాదంలో కవి భావనాను

సారం ఒక్కొక్క పదచిత్రాన్ని ప్రతీకలుగా నిలుపుకుంటూ పోతాడు. అంతే తప్ప ఫలానా భావానికి ఫలానా వస్తువునే ప్రతీకలుగా నిలపాలనే నిర్ధారణ (fixations) లుండవు. అదే ఈ సంవిధానానికిగల సౌకర్యమూ, సంకీర్ణతా కూడాను.

తుఫాను అనే కవిత బీభత్సప్రధానమయిన ప్రతీకలతో తీర్చిదిద్దబడింది. "ఏమోయి తుఫాను! ఎక్కడికి పోతున్నావు" అన్న ప్రారంభవాక్యంద్వారా గొప్ప personification సాధించాడు. అమూర్తానుభవాన్ని మూర్తిమంతం చేశాడు. ఆ తుఫానుగాడి ముఖం ప్రశాంతంగాఉంది. లోపల అలజడికి ఆచ్ఛాదనగాఉంది. అదే ఆశ్చర్యకర విషయం. వాడికయినా ఒక శేటుండె. వందగాయాలకు వానిలో చోటెక్కడిది. 'తుఫాను ఓడినప్పుడు' అంటే వీగిపోయినప్పుడు ఎవర్నీ నిందించదు. నిరాశతో నిట్టూర్చదు. దాని రస్తాలో వీస్తున్న చలిగాలి తప్ప అంతటా శాంతి తాండవిస్తుంది. వీధి లాంతర్లు ముద్దలు ముద్దలుగా గుడ్డివెలుగులు కక్కుతాయి. అంతటా మామూలుగానే ఉంటుంది. మరొకప్పుడు ఈ తుఫానుగాడు విజయోత్సాహంతో ఉరకలువేస్తాడు. అప్పుడూ ప్రశాంతంగానే ఉంటాడు - చిత్రం! తప్పట్లూ తమాషాలూ ప్రదర్శించడు. మెప్పులకోసం గొప్పలూ గోసాయి చిట్కాలూ ఆర్భాటించడు. తుపానుగాలికి వాల్ పోస్టర్లు మాత్రం కరతాళధ్వనులు చేస్తాయి. వంటరితనంతో వికటాట్టహాసం చేస్తాయి. తుఫాను విప్పిన పేజీల్లోంచి అక్షరాలు పక్షుల్లా ఎగిరిపోతాయి. వాస్త

వానికి రాసిన అక్షరాలు వానజల్లుకు కొట్టుకుపోతాయి. అలాగే తుపాను గాలి వీస్తున్నపుడు కొమ్మలమీద ప్రశాంతంగా కూర్చునే పక్షులు ఎక్కడికెగిరి పోతాయో! గతకాలపు ఆన వాళ్ళు మాత్రం తుపానుకు కొట్టుకుపోవు. ఈ వాస్తవాన్నే వక్రోక్తి వైభవంతో ఇలా చెప్పాడు కవి.

'అక్షరాలు పక్షుల్లా ఎగిరిపోయాయి
అర్థాలు మాత్రం మిగిలి ఉన్నాయి
ఎడారిలో మైలు రాళ్ళలాగ'

ఎడారిని తుపానులూ వర్షాలూ ఏమేచేయలేవు. అందులోకి మైలు రాళ్ళని అసలేమీ చేయలేవు. ఒకవేళ ఏతుపానుకేనా కవిత్వం ఎగిరిపోయినా, అది సాధించిన అమూల్యార్థాలు మాత్రం జాతికి రక్తనిష్ఠమవుతాయి. ఎడారి వంటి జీవితంలో మెరుస్తాయి.

'నారస్తా' అనే కవితలో కోట్లాదిగా ప్రజల పాదాలతో పునీతమయివున్నదేదో అదే తన రస్తా అంటాడు. ఈ దేశం శరీరంలో పల్లెలగుండా, పట్నాలమీదుగా మండే రక్తనాళంలా ఏదయితే పరిగెత్తుతోందో అదే తన రస్తా అంటాడు. లోకాన్ని సుఖపెట్టడంకోసం ఈ రస్తా తాను కష్టాల్ని భరిస్తోంది, యుద్ధాలు చేస్తోంది. ప్రాణాల్ని ఆటబొంతుల్లా విసిరేస్తోంది. గెలుస్తోంది. ఓడుతోంది. అయినా జయాపజయాలను ఖాతరు చేయకుండా ముందుకే పోతోంది. ఆ రస్తాలో సంకెళ్ళు సవాలుచేస్తాయి.

అపజయం అగ్నిజ్వాలై మండుతుంది. మరణం మహాప్రబంధంగా ప్రతిధ్వనిస్తుంది. అదే తన రస్తా. ఈ చివరిమాట మహాప్రబంధం అనే పదచిత్రం ద్వారా ఒక గంభీరమైన భావం ఇమడ్చబడింది. అపజయం అగ్నిజ్వాలై మండగా వీరులు బలిపీఠమెక్కారు, ప్రతిఒక్క వీరుని జీవితకథనమూ ఒక మహాప్రబంధానికి ఇంధనం. ఎన్నికథలో, ఎన్నిగాథలో ఆ రస్తాలో ప్రతిధ్వనిస్తాయి.

'రంగులచేప' అనే కవిత సామాజిక అహానికి ప్రతీక. తాను మానవ సూర్యుడు. బాధల్లో క్రుంగుతాడు. తిరిగి సంతోషాల్లో ఉదయిస్తాడు. కనక సామాన్యునికి తాను భరోసా చెప్పగలడు. గాలిచేత గాయాలుతిన్న ఆకులా ఎగిరిపోవద్దంటాడు. సామాన్యుని తలపుల తోటల్లో ఒకదాన్నొకటి తరుముకుంటూ పరుగులెత్తే ఆశలెన్నో ఉండేవి. కాని నేడు సామాన్యుని మనస్సు విరిగిన ఇంద్రధనుస్సు. చెత్తకుండీలో పువ్వులు వికసిస్తాయనుకుని వాడు వాటిని నెత్తిమీద పెట్టుకుని తిరుగుతున్నాడు. ఆ తప్పు వాడిదే. తాను నెత్తినెక్కించుకున్న వాళ్ళు ఎలాంటి చెత్తకుండీలో వాడికి తెలియదు. ప్రచండ ఆతపాగ్నికి వర్తమానకాలంలో సముద్రాలే ఎండిపోతున్నాయి. సామాన్యుని కన్నీరొక లెక్కా జమా. అనుస్యూతంగా ప్రవహించే జీవన వాహిని కాలం. అందులో అలజడితో పరుగులెత్తే రంగులచేప—జీవితం. అది కన్నీళ్ళ వలలకు చిక్కదు. కలల గేలాలకు తగులుకోదు. ప్రార్థనల ఉపవాసాల దోసిళ్ళ కందదు.

కనక తనవలెనే సామాన్యుడు మహామానవుడై మండే సూర్యుడై బాధల్లో మునిగి సంతోషాల్లో ఉదయించాలని కవి వ్యంగ్యంగా సూచించిన ప్రతిపాదన.



ఇలా ఈ మండే సూర్యుడులోని ముప్పయ్యారు కవితలలోనూ నిబిడీకృతమైన కవితా సౌందర్యాలను వ్యాఖ్యానించుకుంటూపోతే మంచి కవిత్వానికీ సహృదయ పాఠకుడికీ మధ్య వ్యాఖ్యాన మొక సూచనా మాత్రమైన వంతెన కట్టగలదు. అంతే తప్ప పాఠకుడ్ని తన భుజాలపై కెక్కించుకుని మోసుకుపోవడం వ్యాఖ్యాత పనికాదు. సహృదయ పాఠకుడు ఎవడికి వాడుగా భావనాదీపిక సహాయంతో కవిత్వాన్ని అధ్యయనం చెయ్యాలి. ఆ మాధుర్యాలను తనివితీరా అనుభవించాలి. తన హృదయాన్ని రసపుష్కలం చేసుకోవాలి. అంతే, ఎరో మధ్యే మార్గంలేదు. ఏతన్మాత్రమైన మాధుర్యానుభవానికి వ్యాఖ్యాత మార్గ నిర్దేశకుడై తేచాలు. అతని కృషి ధన్యమైనట్లే.

1975 ఫిబ్రవరి నాలుగవ తేదీన — ఈ మండేసూర్యుడు, రక్తరేఖ అనే పుస్తకాలను శ్రీ శేషేంద్రశర్మ ఉత్సాహాదరంతో నాకు పంపినపుడు చదివి, ఆయనకొక లేఖ రాశాను. అందులో — "నాకు శేషజ్యోత్స్న గొప్ప అమెత చేసింది ఇప్పుడీ మండే సూర్యుడు మరింత గొప్పవిందు... నేను చాలాకాలంగా

మంచి కవితకోసం శూన్యంలో వెతుకుతున్నాను. ప్రతివాడూ గుండెల్ని బ్యాంకులో డిపాజిట్ చేసుకుని పెద్ద ఉపదేశికుడిలా భోజుపెట్టేవాడే కాని అనుభూతిని పలవరించడం ఈ జాతికి చేత కాలేదు. అందుకే నా అన్వేషణ శూన్యంలోనే మిగిలిపోతూ వచ్చింది ... అలాంటినాకు ఒక తీయని గమ్యాన్ని ప్రసా దించింది మీ కవిత – ఒక హాయినిచ్చే చలివేంద్ర! మీ కవితలు చదువుతూంటే నాగుండెల్ని నేనే విప్పి చదువుకుంటున్న అను భూతిపొందాను ... తెలుగు కవితావనంలో సౌరభోపేతమైన ఇమేజిస్టు పూలచెట్లు వేళ్ళమీద లెక్కించ తగినంత కొద్దిగా మాత్రమే ఉన్నాయి. అందులో మీ కవిత సింహాచలం సంపెంగ చెట్టు!..

"మీ కవితపైనా, మీ రచనలన్నిటిపైనా ఒక సమగ్ర సమాలోచన (Treatise) రాసి ప్రచురించాలన్న ఆకాంక్ష కలి గింది. మీ పద్యకావ్యం సోహరబ్-రుస్తుమ్ పిఠాపురం నుంచి కాంతిలోనికి ఆవిష్కృతమైంది లగాయతు, మీలోని మహాకవి కోసం హృదయయాత్రికతో నిరీక్షిస్తూనే ఉన్నాను. ఇన్నా ళ్ళకి నాకలలు సఫలమై మీరు నవ్యోజ్వలంగా రసమయ సాక్షా త్కారం చేశారు!... ఉప్పాడ సముద్రతీరంలో పాతికేళ్ళక్రితం మనం ఇసుకలో పారవేసుకున్న కలల్ని అప్పుడప్పుడు ఇంకా వెతుకుతూనే ఉంటాను. సముద్రపు అలలపై కలల్ని కోరికల్ని ఆరవేస్తూ ఆకాశానికి ఒకజే అంగవేస్తూ ఉంటాను. ఎందుకో పాపం, సముద్రం తెల్లబోయి చెంపకి చేరడేసికళ్ళతో

నవ్వుతూ, త్రుళ్ళుతూ, కవ్విస్తూ అలాగే చూస్తూ ఉంటుంది. ఆ మెరిసే కళ్ళనెంతవెతికినా నాకేమీ దొరకలేదు. ఆ ఖరికింత కాలానికి మీరు మండే సూర్యుడై సాక్షాత్కరించి ఆకారజలధి నుంచి ఆవిర్లు పీల్చుకుని నా హృదయంపై అమృతాన్ని వర్షించారు ..."

అంటూ ఆనాటి లేఖలో ఒక రేఖగా మలచిన నాతొలి ఆనందాన్ని ఈ వ్యాఖ్యద్వారా ఆవిష్కరించి, కొంతయినా కృతార్థుడి నయ్యానన్న సంతృప్తితో నా ఈ సమాలోచనను ముగించబోతున్నాను.

---

ఎనిమిదవ ప్రకరణము :

# ఈ సమాలోచన ముగిస్తూ...

ఒకమాట చెప్పాలని ఉంది. శేషేంద్రశర్మ నాకు జగన్నాథ పండితరాయల పోలికలతో పుట్టిన ఆధునిక కవితావతారంగా దర్శనమిస్తాడు.

"ఖంజాయితోధిమతి గంజాపిరోపిపత సంజాయుతేత్ర ధనదః
సంజాఘటీతి గుణ పుంజాయితస్య నతు కుంజామితంచ కనకం
కింజాగ్రతీ జయసి కింజానతీస్వపిపి సింజాన నూపుర పదే
తేజోపురేశి ! నవకంజాక్షి ! సాధు ! తదితంజాతు !
వాకిము ! శివే !

అంటూ ధీమాగా తనకు అవాంఛితాలైన సర్వ విషయాలను ఒకే అశ్వధాటితో తిరస్కరించగలిగే ధీశాలిగా, స్థిరచిత్తునిగా, రాజసమూర్తిగా శ్రీ శేషేంద్రశర్మ సదా నాకు కనిపిస్తాడు.

అంతేకాదు : "పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా !'' అని ప్రస్తుతించవలసిన పాండిత్యంగల పితృపాదుల వద్దనే ప్రాథమిక గీర్వాణ విద్యాభ్యాసంచేసి, జ్ఞానాహామికను సంతరించుకున్నాడు. ప్రాక్పశ్చిమ కవితాపారావారాన్ని సహస్ర బాహువులతో ఈది తీరంచేరి స్థిమితపడ్డాడు.

"ఇయం సుస్తనీ మస్తకన్యస్త కుంభా
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తీ
గృహీత్వాఘటేన్యస్య యాతీవభాతీ !"

అని తాను హృదయపూర్వకంగా ఆకాంక్షించే వనితాలలామను చేతులుచాపి ఆహ్వానించగలిగే హృదయ నిర్భరత గల ధీర హృదయుడు.

అసలు శ్రీ శేషేంద్రను చూస్తే నా కలనాటి జగన్నాథ పండితరాయలే ఎందుకు స్మృతివీధిలోకి రావాలో మనవిచేస్తాను. సంస్కృత సాహిత్యాన్ని పండించిన మహాకవులెందరో ఉన్నారు; కాని నా కించిజ్ఞతకు మాత్రం ముగ్గురే గొప్పకవులు తలలు పైకెత్తి దర్శనమిస్తారు. వారు: వాల్మీకి, కాళిదాసు, జగన్నాథ పండితరాయలు; ఈ త్రిమూర్తులే నా చీకటిగదుల నిదిర మసకల కలలకు తలపుల జలతారు చాందినీలలంకరిస్తారు! అయితే మాత్రం శ్రీ శేషేంద్రకు జగన్నాథపండితరాయలవారి పోలి కలున్నాయని నామనస్సు ఎందుకు విశ్వసించింది విశ్వాసం అంటే, హేతువాదానికి లొంగనిదని అర్థం. అయినా నా కారణాలు నేను మనవి చేస్తాను.

స్వర్గీయ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారికి - శ్రీశ్రీ శ్రీనాథుని అవతారమని ఒక బ్రాహ్మీ ముహూర్తంలో స్ఫురించిందట! వెంటనే ఆయన అరుణాచలం వెళ్ళి రమణ మహర్షి

ఆశ్రమంలో స్థిరపడిన చలంగారిని సందర్శించి ఈశ్వరుణ్ణి సంప్ర దించారట. ఇది 1954 జనవరిలోని సంఘటన. వెంటనే చలంగారి ఈశ్వరుడు-ఇంకా సందేహమూ వత్సా! శ్రీశ్రీ శ్రీనాథుని అపరావతారమే!" అన్నారట. సంతృప్తిగా తిరిగివచ్చిన జరుక్ శాస్త్రిగారు తన ఉపాసనాదైవమైన దేవిని సంప్రదించగా ఆవిడా ఈ విషయాన్నే బలపరచారట! ఈ విషయాలన్నీ 1954 ఫిబ్ర వరిలో వారింటికి నేను వెళ్ళినపుడు ఎంతో ఉద్రేకంగా శ్రీ శాస్త్రిగారు నాకు సెలవిచ్చారు. ఈ నిర్ధారణకెన్నో ఉప పత్తులు చెప్పారాయన. అయితే శ్రీశ్రీకి శ్రీనాథుడికీ ఎన్నో పోలికలున్నసంగతి కేవలం మహాప్రస్థానాన్నీ, ఖడ్గసృష్టినీ ఇతరేతర ఇటీవలి కృతులను మాత్రమే చదివినవారికి స్ఫురించక పోవచ్చు. శ్రీశ్రీ నూనుగుమీసాల నూత్నయౌవనంలో రచిం చిన 'ప్రభవ'కావ్యాన్నీ తరువాత రచించిన 'స్వర్గదేవతలు' వంటి కావ్యాలను చదివి అందలి సమాస తత్పరతను అవగాహన చేసు కున్నవారికి శ్రీశ్రీ, శ్రీనాథులకు నామసామ్యమేగాక కవితా సాదృశ్యంకూడా ఉన్నదని గ్రహిస్తారు. అది జరుక్‌శాస్త్రి వాదన! ఈ సంగతినింత వివరంగా చెప్పినా దీనికిక్కడ సందర్భ శుద్ధిలేదు.

ఇంతకీ శేషేంద్రశర్మ వ్యక్తిత్వం గురించి భావన చేయగా నాకు 'లవంగీ కురంగీ వల్లభుడైన జగన్నాథ పండితరాయల' వారు సాక్షాత్కరిస్తారు. వీరిరువురికీ శేముషీ వైభవంలో సాదృశ్య ముంది. ప్రతిభావ్యుత్పన్నతలలో పోలికలున్నాయి. ఇరువురూ

స్వేచ్ఛాశీలురు. స్వాతంత్ర్య దార్ఢ్యం కలవారు. భారతీయ సంస్కృతీ దేవాలయం ముందు ఇరువురూ ధ్వజస్తంభంలా నిలచినవారు. ఏ చిరుగాలి కెరటానికయినా ప్రకంపించే వారి హృదయాలు ధ్వజస్తంభ ఘంటికావితానంవలె ఘలంఘలలు వెదజల్లుతాయి. కవితాసుమధురనాదాల నుద్ఘాతం చేస్తాయి. కవితా సౌందర్యోద్భాసితులుగా వీరిరువురూ సమానులు.

"అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'

అని ఆనందవర్ధనాచార్యుడు చెప్పినట్లు జగన్నాథపండితరాయల వలెనే శ్రీ శేషేంద్ర అపార కావ్యసంసారదక్షుతో కవి ప్రజాపతి అయినవాడు. సాహితీ రసికతలో గుణగ్రహణ పారీణతలో వీరిరువురూ సమాన ధర్ములు. అసదృశ వల్లభులు. వ్యక్తులుగా శృంగారులు.

జలసూత్రం పండితునివలె నాకు దేవీఉపాసనాది కర్మకాండలపై వీసమెత్తయినా విశ్వాసంలేదు. పునర్జన్మలోగాని అవతారాలలోగాని గడ్డిపరకంతయినా సమ్మకంలేదు. ఉంటే ఎంతబాగుండునా, శేషేంద్ర జగన్నాథుని అపరావతారమే నని నాకు కలలో దేవతలెవరో చెప్పారని హాయిగా, నిష్పూచీగా చెప్పిఉండేవాడినే, అనే బెంగ కలిగినమాటమాత్రం నిజం!

వీరిరువురికీ సమకాలీన అసంస్కృత చేతస్కులతో సరిపడదు. పైగా అపార తూష్ణీభావం ఉండటమూ సమాన ధర్మాలే!

"మలయానిల కాలకూటయోః
రమణీకుంతల భోగిభోగయోః
శ్వపచాత్మ భువోనిరంతరా
మమజాతా పరమాత్మనిష్ఠితః॥

అనగలిగే చిత్తస్వాస్థ్యం శేషేంద్రవంటి స్వతంత్రులకే ఉంటుంది.

వీరిరువురికీ ఇక్కడ తులనాత్మక పరిశీలన చెయ్యడం నా ఉద్దేశంకాదు. జగన్నాథ పండితరాయలవలెనే శేషేంద్ర పండిత కవికూడా-ఆధునిక లక్ష్యలక్షణ సమన్విత ప్రాయమనదగిన కావ్య నిర్మాణ సామర్థ్యం ప్రదర్శించాడు. ఆయనవలెనే ఈ కవికూడ ఒక కవితాయుగానికి మంగళవాచకాన్ని ఆగామి కవితాయుగానికి ఆహ్వానగీతికను ఏకదేశంగా ప్రతిష్ఠించాడు. మూడు పాతికలు గడిచి నూతన శతాబ్దికి అంగలారుస్తున్న ఆధునిక యుగంలో నూత్నకవితా అధిష్ఠానంగా తన శేషేంద్రజాలాన్ని ప్రదర్శిస్తున్నాడు. జగన్నాథపండితరాయలవలెనే ఈ ఆధునిక యుగంలో ఆత్మవిశ్వాసవ్యగ్రతతో కవితా పతాక నిలుపుతున్నాడు.

"నిర్మాయ నూతనముదాహరణానురూపం
కావ్యం మయా௨త్ర నిహితం నపరస్య కించిత్
కిం సేవ్యతే సుమనసాం మనసా௨పిగంధః
కస్తూరికా జననశక్తి భృతా మృగేణ?"

అనే చిత్తదీప్తితో ఇరువురూ అత్తరు దీపకళికల్లా నిలచి ధైర్యంగా అనగలిగినవారు కనుకనే కించిత్ శబ్దబేధంతో జగన్నాథుని మాటలతో శేషేంద్రుని నిర్వచించవచ్చు. మనన తరి తీర్ణ విద్యార్ణవో శేషేంద్రకవి పండిత నరేంద్రః!" అని అభినందించడానికి ఎవరూ సందేహించనక్కరలేదు ;

స్వస్తి !

ఈ గ్రంథ రచనకు ఉపయుక్తమైన గ్రంథాలు :-


1. పక్షులు- శ్రీ శేషేంద్ర.
2. శేషజ్యోత్స్న- శ్రీ శేషేంద్ర.
3 మండేసూర్యుడు - శ్రీ శేషేంద్ర.
4. రక్తరేఖ - శ్రీ శేషేంద్ర.
5. The Creative Experiment-By Sir C.M. Bowra.
6. Poetry and Experiance -By Archibald Macleish
7. Struggle of the Modern - By Stephen Spender.
8. Poetry Scince 1939 -By Stephen Spender.
9 The Modern Writer and his world- By G. S. Fraser.
10. The Problems of Style- By J Middleton Murray.
11. Life of Ezra Pound - By Noel Stock.
12 Picasso : His life and work- By Roland Penrose